

ఇండియా వైస్ ప్రెసిడెంటు డాక్టరు యస్. రాధాకృష్ణగారు న్యూఢిల్లీలో భరతనాట్య ప్రావీణ్యానికి శ్రీమతి బాలసరస్వతికి సంగీత నాటక అకాడమీ వారి సన్మాన సత్కారాల నందజేస్తున్న సన్నివేశము.



న్యూఢిల్లీలో జాతీయ గ్రామీణ మహిళల సమావేశం జరిగినప్పుడు పలు రాష్ట్రాల ప్రతినిధులు పాల్గొన్నారు. చాలమంది తమ సమస్యలను గురించి ఉపన్యసించారు. ఒక కర్షక మహిళ శ్రీమతి హర్నంకౌర్ (అమృత్ సార్) సమావేశానికి అధ్యక్షత వహించారు. ఈ చిత్రములో అహమదాబాద్ ప్రతినిధి ఉపన్యసించుచుండుటను చూడనగును.


SARASWATA NI
ALEM




### పాలుచందా మొదలగునవి

ఈ సచిత్ర మాసపత్రిక పాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకే ప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డరు, పోస్టలు ఆర్డరు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.




వ్యవస్థాపకులు

డాక్టరు. కే. యన్. కేసరి

ఆక్టింగ్ ఎడిటర్

సి. సి. పున్నయ్య

సంపుటము ౨౮]  మే 1955  [సంచిక ౫

# విషయసూచిక





శ్రీమతి పొణకా కనకమ్మగారు
1955 సం॥పు 'గృహలక్ష్మి' స్వర్ణకంకణ గ్రహీత




జయజయ గృహలక్ష్మి సఖీ ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతికా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



---

# పూజ్యులు కేసరిగారి జన్మదినోత్సవం

## శ్రీ సి. సి. పున్నయ్యగారి స్వాగతోపన్యాసము.

---

పూజ్యులారా, సోదరసోదరీమణులారా!

ఈ రోజున పూజ్యబాబు. కేసరిగారి జన్మదినోత్సవము జరుపుకుంటూ, గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానమునకుగాను రు5000/-లు, స్వీయసంస్థలలోని పరివారమునకు అన్నవస్త్రదానములకని, రు 50000/-ల రూపాయల విలువగల భవనమును నిధులుగా ఏర్పరచి ఏటేటా వారిజన్మ దినమునాడు అన్నవస్త్రదానములు, స్వర్ణకంకణ ప్రదానము జరుగునట్లు నిర్ణయించిన శ్రీ కేసరిగారి ఔదార్యానికి మనం భక్తి విశ్వాసాలను వెల్లడించుచున్నాము.

స్వర్ణకంకణ ప్రదానము 1934లో శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారికిచ్చిన దానితో ప్రారంభమయి యిప్పటిదానితో 16 కంకణాలగుతవి. ఇప్పటివరకు కంకణ గృహీతలలో విదుషీమణులు, కళాకారులు, కళారాధకులు, గాయకులు, సంఘసేవకులు, రచయిత్రిలున్నారు. ఈ కంకణ ప్రదానం మహిళా ఉద్యమాన్ని, అభ్యుదయాన్ని ప్రోత్సహించడానికి ఏర్పడింది. శ్రీ కేసరిగారు తమ జీవితకాలంలో స్వయంగా కంకణప్రదానం చేస్తూయుండి, తన అనంతరము సహితం మహిళాభ్యుదయాన్ని ప్రోత్సహించడానికి శాశ్వత నిధిని ఏర్పరచడం వారి వదాన్యతకు మెరుగులు తీర్చింది.

ఈ ఏటి గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత శ్రీమతి పోణకా కనకమ్మగారు నిష్కళంకమైన జాతీయవాది. దేశభక్తురాలు. జాతీయఉద్యమంలో ఆమె నిర్వహించిన వీరోచితమైన పాత్ర, జాతీయ అభ్యుదయ కార్యకలాపాలలో ఆమెచూపుచున్న ఆసక్తి, చేస్తున్న నిర్విరామకృషి పేర్కొనతగినవి. పైగా రచయిత్రి. ఆమెరచనలు భక్తి, పారమార్థిక తత్వాలను ప్రోత్సహిస్తూ పాఠకులలో సన్మార్గ, సద్భావాలను పదిలపరచునవిగానున్నవి. వీటన్నిటి దృష్ట్యా శ్రీమతి కనకమ్మగారికి ఏనాడో యీ కంకణప్రదానము జరుగవలసింది. అది యీనాడు శ్రీమతి మాధవి అమ్మగారు జరుపుచుండటం, యీ మహోత్సవ కార్యక్రమము కుమార్తెలు శ్రీమతి కే. శారదాదేవిగారి అధ్యక్షతన, కుమారి వసంత దైవప్రార్థనతో వైభవంగా జరుగడం అత్యంత సంతోషకరమైన విషయము.

క్రిందటి సంవత్సరము శ్రీ కేసరిగారి మరణమువలన విచారసూచకముగా కంకణ ప్రదానము జరుగలేదు. ఇక మీదట ఏటేటా నిరాటంకముగా శ్రీ కేసరిగారి అభీష్ట ఆదేశాల ప్రకారం స్వర్ణకంకణ ప్రదానం జరుగగలదు. గృహలక్ష్మి పత్రికపట్ల ఎప్పటి ఆదరాభిమానములు కలిగి కేసరిగారు స్థాపించి నిర్వహించుచుండిన సంస్థను పోషించుకో వలసిన బాధ్యత ఆంధ్రప్రజానీకంపై అధికంగానున్నది.



గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత

# శ్రీమతి పాణకా కనకమ్మగారి

## ఉపన్యాసము

సుభాశయులారా,

ఆంధ్రజనని అల్లారు ముద్దుబిడ్డ, తెలుగువారి గారాబు చెల్లెలు, గృహలక్ష్మి సువర్ణకంకణ స్వీకారానికి ఆహ్వానించినందుకు నిర్వాహకులకు హృదయపూర్వక ధన్యవాదాలు. ఈ శుభ సమయంలో ఆయుష్మతి 'గృహలక్ష్మి'కి శుభాభినందనలు. ఈ సువర్ణ కంకణం విదుషీ సత్కారంతో కీర్తికుసుమాల పొదివికొన్నది. 27 వసంతాల పూర్వం శ్రీమంతుడు, ధీమంతుడైన వొక భావ సంపన్నుని హృదయక్షేత్రంలో సురభిళ రోజా పుష్పమై తెలుగుతల్లి యశశ్చంద్రికలు తొలకరిస్తూ మన 'గృహలక్ష్మి' అవతరించినది. ఆయనే శ్రీ కేసరిగారు. మనోజ్ఞమైన శైశవ బాల్యాలు గడచి లావణ్యంతో తెలుగు ఎల్లలుదాటి, ఇరుగు పొరుగు రాజ్యాల సైతం సుకుమార రూపాల సాక్షాత్కరిస్తూ జైత్రోత్సవాలతో సువర్ణ కంకణాలు, కానుకలు అందిస్తున్న 'గృహలక్ష్మి'కి మంగళాశీస్సులు.

ఆంధ్రుల అభ్యుదయ లక్ష్మికి శక్తి యుక్తులు అంకితమిచ్చి, భాషామ తల్లికి బంగారు కంకణాలు తొడుగుతూ, కీర్తిశేషులైనారు 'గృహలక్ష్మి' స్థాపకులు శ్రీ కేసరిగారు. అర్థమూ, పరమార్థమూ యిరుచేతులా ఆర్జిస్తూ, ఎడమచేతి గడన, కుడిచేతి యీవితో ధన్యులైన వదాన్యులు శ్రీ కేసరిగారు. ఆయన శక్తి ప్రతిభలు ఆంధ్రులకు గర్వరేఖలు.

'గృహలక్ష్మి' కేసరిగారి కూరిమిపుత్రి. కొన్ని కోట్ల ఆంధ్రుల ధనంతో నిర్మితమైన సుందర చెన్నపట్నంలో ఆంధ్ర జ్యోతిని శాశ్వతంగా వెలిగించే కాంతి శిఖరాలు బహు కొద్దిగా వున్నాయి. అందులో వొకటి శ్రీ కేసరి కుటీరం. ఆ ప్రాంగణపు పూలపందిరిలో వెలసి, మూడు భాషలలో పెరిగి ముచ్చటలు కొల్పుతూ, ముక్కోటి ఆంధ్రుల మన్ననలు పొందుతూ వర్ధిల్లుచున్న 'గృహలక్ష్మి' ఆంధ్రనారీలోకానికి అశేషసేవ చేసింది. తెలుగు దేశంలో రెండే రెండు స్త్రీల పత్రికలున్నవి. 'గృహలక్ష్మి' స్థాపకులు తమ ఆశయాలు బహుళంగా సాధించుకొని చరితార్థులైనారు. వారి స్మృతి చిహ్నాలు కేసరి కుటీరం, కేసరి హైస్కూలు, 'గృహలక్ష్మి'. ఈ మూడూ మూడు రత్నాలు. విద్యాదానం, వైద్యదానం, శ్రేష్ఠమైన వుభయదానాలుచేసి వుభయతారక ఖ్యాతిపొందిన నిర్మాతల కృషి శ్లాఘాపాత్రము.

దేశ ఔన్నత్యానికి, జాతి అభ్యుదయానికి పత్రికలు, అందులో వుత్తమ పత్రికలు ఎంతో అవసరం. నవభారత మహోదయానికి, భారత మహిళా సౌభాగ్యానికి భాషాసేవ ఎంతైనా అవసరము. జాతీయ మహోద్యమం విజృంభించేవరకూ భాషారంగమొక్కటే దేశారాధకులకు ప్రధాన వేదికయై అమూల్యకృషి చేసింది.

స్వతంత్ర భారతంలో గల్పవృక్షాలుదాటి, కామధేనువులుపుట్టి, మాణిక్య సౌధాలు నిర్మించి, భూతల స్వర్గం చేయాలని, రామ రాజ్యాలు వర్ధిల్లాలని మన సంకల్పం. భారత శ్రేయోరాజ్యం, ప్రపంచానికి ఆదర్శంగా వికసిస్తున్న స్వర్ణకమలం. ఈ శతపత్ర లక్ష్మికి తొలి, మలి రేకులు, ప్రథమ, ద్వితీయ పంచవర్ష ప్రణాళికలు. జాతీయ ప్రణాళికలో అనేక అభివృద్ధి పథకాలున్నవి. అందు ఎన్నో శరవేగంతో కృషిచేస్తున్నవి. వానిలో భాషాభివృద్ధికూడా చాలా ప్రాధాన్యమైన అంశం కావలసియున్నది. భాషాభివృద్ధికి పరిషత్తులు, కళాశాలలు, పాఠశాలలూ, గ్రంథాలయాలూ ఎంత అవసరమో, గ్రంథ ప్రచురణ కూడా అంత అవసరం. గ్రంథ ప్రచురణ ఎంత అవసరమో, చక్కని పత్రికల నిర్వహణ, పెంపుదల కూడా అంత అవసరం.

స్వీయ సంస్కృతిని, సారస్వతాన్ని పరిపుష్టం చేసుకుంటూ జీవశక్తులతో దేశాన్ని, సంఘాన్ని నడపగల శక్తి పత్రికలకున్నది. జాతికి నవజీవనం పోస్తూ నిత్యచైతన్యంతో విలసిల్లవలసినవి పత్రికలు,

స్త్రీల పత్రిక లేకాదు, మనకు మంచి మాసపత్రికలే చాల తక్కువగా వున్నవి. విదేశాలలో అనేక సుందర రూపాలలో ఎన్నో పత్రికలు వుంటవి. తుదకు మన యితర రాష్ట్రాలలోకూడా హెచ్చుగానే వున్నవి. వుత్తమమైన పత్రికలు రాజ్యాంగాన్ని విశదీకరించి తెలుపగలవు. అనేక వుద్గ్రంథాల సారాంశమును క్రోడీకరిస్తూ ప్రకటించగలవు. మహోత్కృష్టమైన విషయాలు సేకరించగలవు. కాలగర్భంలో దాగుకొన్న అజ్ఞాత మణులను సైతం కంటి ముందుకు తేగలవు. పత్రికలు ప్రపంచాన్ని ప్రతిబింబించే అద్దములు. అంతేకాదు స్త్రీల సమస్యలను సుపరిష్కృతం చేయుటకూ, స్త్రీల హక్కులను సుసాధ్యం చేయుటకూ, స్త్రీల బాధ్యతలను సువేద్యం చేయుటకుకూడా పత్రికలు సహాయకారులు.

జాతీయ ప్రణాళిక అనేక అభివృద్ధి పథకాలలో సమాజ సంక్షేమం వొకటి. ఈ సంక్షేమ కార్యక్రమం సగానికి సగం స్త్రీలపైన ఆధారపడియున్నది. సృష్టిలో యించుమించు అర్ధభాగం స్త్రీలున్నారు. విశేషించి యీ పుణ్యభారత ధాత్రిలో స్త్రీ స్థానము పరమోత్కృష్టమైనది. భారత వర్షంలో స్త్రీని జగన్మాతగా పూజిస్తారు. విద్యాధి దేవతగా, లక్ష్మీ స్వరూపంగా భావిస్తారు. విశ్వధాత్రిగా; విశ్వనేత్రిగా సేవిస్తారు. భారత స్త్రీ మాతృమూర్తి. ఈ దేశంలో విశ్వజనయిత్రి అయిన సీతాదేవిని పూజించినట్లు ప్రపంచంలో ఎక్కడా ఎవరినీ పూజించరు. అది అనుపమానము. అది ప్రతి స్త్రీ వాంఛింపదగిన మహోన్నత పదవి.

స్వరాజ్యము వచ్చిన పిమ్మట మనము ఎన్నో ఘనకార్యాలు సాధించినాము. స్వతంత్ర భారత పురోగమనాన్ని చూసి ప్రపంచము ఆశ్చర్యపోతున్నది. ఇండియా విదేశాంగ నీతికి, ప్రధాని నెహ్రూ శాంతి విధానానికి లోకము జోహార్లిస్తున్నది. మనకు విజయలక్ష్మీ పండిట్ వంటి స్త్రీలున్నారు. పురాణ గాథలు కావు. ఈ నాడు జగదీక జనని యనదగిన కైవల్యవాసిని, పుణ్యమూర్తి కస్తూర్బా మన తల్లి. పూజ్య బాపూజీ అవతారము వొక విశ్వజ్యోతిగా తేజరిల్లి సమస్త భువనానికి మార్గదర్శియై మహా నిర్వాణము పొందింది.

స్వతంత్రము సిద్ధించి సప్త శరత్తులు నిండకముందే భారతీయులు లోకోన్నత కీర్తి పొందగలిగినారు. అయినా సంఘాభ్యుదయానికి మనం చేయవలసినకృషి ఎంతైనా వున్నది. సమాజ సంక్షేమంలో మనము చాలా వెనుక పడివున్నాము. భారత ప్రభుత్వం యీ అవసరమును గుర్తించింది. శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ గారి అధ్వర్యమున కేంద్రసంఘ సంక్షేమ సంస్థ స్థాపింపబడి అమోఘకృషి చేస్తున్నది. అయితే విద్యావతులైన స్త్రీలు, యువతులు వుత్సాహముగా సేవాక్షేత్రములోనికి వచ్చేవారు అరుదుగా వున్నారు. చదువుకున్న స్త్రీలుకూడా వుద్యోగము, పెండ్లి, యీ రెండు మాత్రమే పరమావధిగా భావిస్తున్నారు. విద్యావతియైన యువతికి యిరువది ఏండ్లువస్తే వివాహం దుస్తరంగా వుంటున్నది. విద్యావంతులైన యువకులుకూడా చదువుకున్న బాలికలకంటె డబ్బుగల పిల్లలయందే మోజుగా యుంటున్నారు. కట్నాలభారం తప్పడంలేదు. కట్నాల బిల్లువస్తే అందులోనూ బ్లాక్ మార్కెట్ తయారు. దేశాభ్యుదయమునకు యిది శుభచిహ్నము కాదు. భారతదేశ ఔన్నత్యం కొంచం సింహావలోకనం చేసుకోవాలి. ఈనాడు డబ్బుకున్నవిలువ మనిషికి లేదు. యిది మిక్కిలి శోచనీయం. మానవుడు కోట్లు సృష్టించగలడు. కాని డబ్బు మనిషిని పుట్టించలేదు. భారత సంస్కృతీ సాంప్రదాయములు లోకోత్తమమైనవి. ఇది గమనార్హము. నేటి యీ అవలోపాలు తొలగిపోవాలి. చదువూ సంస్కారమూ కలిగిన స్త్రీలూ, పురుషులూ, యువతులూ, యువకులూ సేవాపరులై ముందుకువచ్చి దేశకల్యాణాన్ని సాధించాలి.

రాజకీయ స్వాతంత్ర్యం వచ్చినమాత్రాన చాలదు. ఈ దేశంలో బిచ్చగాళ్ళస్థితి విపరీతంగా వున్నది. అది అరికట్టాలి. అనారోగ్యము హెచ్చు. అశ్రద్ధ, అలసత్వము జాస్తి. ఇంకా యిట్టి లోపాలు ఎన్నో వున్నవి. విశేషించి యీ అవలక్షణాలు

ఆంధ్రదేశంలో విశేషం. వీనిని నివారించాలి. విద్య, విజ్ఞానం పెంపొందాలి. ఆరోగ్యం, ఐశ్వర్యం వృద్ధి కావాలి వ్యవసాయం, వాణిజ్యం, అభివృద్ధి కావాలి. కళలూ, పరిశ్రమలూ వర్ధిల్లాలి. జాతీయ విద్య, ఆర్థిక సౌభాగ్యము, ఆధ్యాత్మిక సంపద ప్రవర్ధిల్లచేసే వృత్తుకు విద్యాసంస్థలు పెంపొందాలి. ప్రజలూ, ప్రభుత్వమూ సర్వశక్తులా కృషిచేసి, భారతదేశము సర్వతోముఖాభివృద్ధి సాధించాలి. అప్పుడే మనము "జయ్‌భారత్" 'వందేమాతరం' అని ముక్త కంఠంతో కీర్తించగలము.

ఆంధ్రదేశము సిరిసంపదలకు నిలయము. విజ్ఞాన సంపన్నులకు నెలవు. సేవా త్యాగములకు ప్రసిద్ధి. ఆంధ్రపతాక ఒకనాడు భారతజనని దివ్య కిరీటానికి కలికి తురాయియై కాంతులు విరిసింది. నేడు క్రొత్త ఆంధ్ర ప్రభుత్వము నెలకొన్నది. తెలుగు బావుటా తిరిగి దేదీప్యంగా విజయ విహారం సాధించుగాక.

జయ్ హింద్.

తెలుగు సీమల పసిడి పంటలను పెంచి
తెలుగు వాణికి అమృత గీతికలు పాడి,
తెలుగు తల్లికి రతనాల కొలువు అబ్బి,
తెలుగు గృహలక్ష్మి: చిరము వర్ధిల్లుమమ్మ!!

---

సోవియట్ విశ్వవిద్యాలయాలూ, విద్యా సంస్థలు, పరిషత్తులలో పనిచేసే సిబ్బందిలో దాదాపు 77,000 మంది పరిశోధనచేసే స్త్రీలున్నారు. సోవియట్ దేశ శాస్త్రవిజ్ఞాన పరిషత్తు సిబ్బందిలో సుమారు నూటికి 40 మందీ, ఎస్తోనియన్ శాస్త్ర విజ్ఞాన పరిషత్తు సిబ్బందిలో మూడవ వంతుకు పైగానూ స్త్రీలున్నారు.

సోవియట్ కళాకారుల మాస్కో సంఘంలో 766 మంది స్త్రీలు సభ్యులుగానూ, కేండిడేట్ సభ్యులుగానూ వున్నారు; దాని పేనల్‌లో 36 గురు వున్నారు. చాలమంది స్త్రీలకు ఆనర్డ్ ఆర్ట్ వర్కర్ అనే గౌరవ ప్రదమైన బిరుదు యివ్వబడింది.

ప్రతీ సోవియట్ రిపబ్లిక్‌లోనూ స్త్రీలు కళాకారులుగా వున్నారు. బైలో రష్యా లలితకళల్లో 15 మందీ, కజక్‌స్తాన్‌లో 9 మందీ, మాల్డావియాలో ఏడుగురూ వున్నారు.

'టాస్'

♦ ♦ ♦

దేశంలో గుడ్డి పిల్లలందరికీ 14 సం॥ వరకూ నిర్బంధంగా, ఉచితంగా విద్య ఏర్పాటుచేయాలని అఖిల భారత అంధ విద్యాగోష్ఠి ఏప్రెల్ 22 న తీర్మానించింది. దీనికి వీలుగా తగిన శాసనాలను రాష్ట్ర ప్రభుత్వములు చేయాలని ఈ గోష్ఠి విజ్ఞప్తిచేసింది. గుడ్డివాళ్లకూ చెవిటివాళ్ళకూ కలిపి సంస్థలను నడపరాదని ఈ గోష్ఠి తీర్మానిస్తూ అది ఉభయులకు నష్టకరమని హెచ్చరించింది. అంధ పాఠశాలలకు కావల్సిన పరికరాలు చౌకగా సప్లయిచేయాలని కోరింది.

— సుబ్బారావుశాస్త్రి

# పాపాయి ఓదార్పు

'కోటసోదర కవిచంద్రులు'



చిదిమిన పాలుగారు నునుజెక్కులు కందఁగ, మోముదమ్మిపై
గదలెడు నీలిముంగురులు, గంటలు కట్టెను ఘర్మ వారిచే
బాదలుచు నింటికప్పెగిరి పోవఁగఁ బెద్దగ నేలయేడ్తువో
గద! గ్రహియింపలేనయితి, కమ్మనికంఠము రాపుజెందగన్!

పువ్వులనొప్పు తెల్లఁదనమున్ దలక్రిం దొనరింపఁజాలు నీ
నవ్వులలో రహస్యమును నాకుజెప్పవ? "ఊఁ" యనంగ నీ
కెవ్వరు నేర్పినారొ! జనయిత్రికిఁ దెల్పవ! మాటిమాటికిన్
అవ్వలనవ్వలన్ గనెడునట్టి విచిత్రమదేదొ! చూపవా!

అరుగో! నాన్న కచేరినుండి యిపుడమ్మా! వచ్చె బంట్రౌతుతో
మరలన్ బోయెదరన్నమున్ గుడిచి, నీ మారాముచే వంట స
త్వరమే చేయఁగఁజాలనైతి, నినుబోల్ పాపాయి యొక్కర్తికే
పరిపోయెన్ దినమెల్ల, తల్లి సుతులన్ సాకంగ నెట్లోర్చునో,

హాయిగ లాలఁబోసి, కడుపారఁగ పాలిడి, బొట్టు పెట్టి, కం
దోయికి కాటుకెట్టి, నినుతొట్లబరుండఁగఁజేసి, యూపగా
నూయెల నాగిపోవ గనుచుండి, "ఊహూ" నను వేగనూపరా
"రే"యనిసైగఁ జేసెదవు? ఎంతటి నేర్పరివమ్మ! బాలికా!

అమ్మెయి మాటలాడెడు నిజాంబ ముఖంబును జూచి, డాలపై
బొమ్మల చక్కచక్కదనమున్ దిలకించుచు, జోలపాట శ్రా
వ్యమ్ముగ నాలకించుచు, బ్రియమ్ముగ నవ్వుచు, దొట్ల నేత్ర ప
ర్వమ్ముగ నాఁటలాడు చిటిపాపకుగల్గు చిరాయురున్నతుల్॥





# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ

(గతసంచిక తరువాయి)

## మానవుని వ్యక్తి స్వరూపము

ఇంతవరకు జీవిత విధానమును గూర్చియు ప్రపంచమున మనకు కలుగు అనుభవముల స్వభావములను గూర్చియు కొంత బాహ్య జ్ఞానమును పొంద ప్రయత్నించి యున్నాము. వేదాంతులకుగాని, విషయవాదులకుగాని, జీవితము అనునది, అనుభవముల పరంపర క్రమము. కాని వీరిలో చాల వ్యత్యాసమున్నది. విషయవాదులు (అనాత్మవాదులు) ఈ జీవితము యొక్క అనిర్దేశ్య జన్మమునఆరంభమాయెను. మరణము అను మరియొకటి ఇందుకుసాటి యనదగు అనిర్దేశ్య సమయమున ముగియుచున్నది అని నమ్ముచున్నారు. ప్రతి మానవుడు ఒక అంధకారమునుండి వెలువడిన బాణము (అంబు) వలె జీవితమును గగనమున ఎగిరి దాటిపోయి మరల అంధకారమున ప్రవేశించుచున్నదని తలచుచున్నారు. ఇట్టి వ్యాఖ్యానముతోనే మన అస్తిత్వమును, జీవిత వేదాంతమును తెలుసుకొని తృప్తిపడువారికి, "భుజించుట, పానము చేయుట, సంతోషముగ నుండుటయే మన కర్తవ్యము. ఏలన మరణానంతరము ఏమిజరుగగలదో మనము తెలియలేకున్నాము" అను తీర్మానము ఒప్పియుండగలదు.

దీనికి వ్యతిరిక్తముగా, దైవీ సంభూతులు అనగా, ఈ జీవితము ఆది, అంత్యములేని నిరంతర వ్యవహారము. దీనికి యొక నిర్దిష్టకారణము కలిగియున్నది. దీని విధానము కడు గాంభీర్యమైనది. దీని తర్కము కడు కఠినము. మనలో ప్రతి యొక్కరు అనుభవించు జీవితము యొక ఫలస్వరూపము. ప్రతిఫలమునకు కారణమొకటి యుండితీరవలెను. కనుక మన జీవితములకుకూడ కారణమొకటి ప్రత్యేకముగా నుండితీరును. కాని దానిని మనము నేడు తెలుసుకొనలేకున్నాము. శ్రద్ధ నమ్మకముగల, నిశ్చలజ్ఞానముగలవారికి, ఈ జీవితము వారి శాశ్వత అస్తిత్వములో ఒకానొక వ్యవహారముగా నున్నదని తెలియగలదు. ఇట్టి వారికి ఈ జీవితము ఒక నిశ్చిత ఉద్దేశము కలిగియున్నది. ఒక కోరదగిన గమ్యస్థానము కలిగియున్నది. పాశ్చాత్య శాస్త్ర నిర్మాతలుకూడ వారి ఎరుకలేకనే ఇట్టి సత్యవాక్యములు వారి విషయ పరిశీలన కృషిలో కనుగొని ప్రకటించి యున్నారు. డార్విన్ మహాశయుడు, మానవాతీత మనుష్య సంఘము జన్మించగలదని దృష్టించి యున్నాడు. ఉపనిషదుల నిర్మాతలను మహాఋషులు, ఈ జీవితమంతయు సంఘటనల పరంపర; వీటిని జయించగలిగిన మానవాతీత పదవిని పొందగలము అని వివరించి తెలుపుచున్నారు. ఒక అనుభవము కలుగవలెనన్న అనుభవించు కర్త అనుభవింపబడు కర్త ఒక చక్కని పరస్పర సంబంధము కలిగియుండవలెనని తెలిసియున్నాము. నేడు ఈ అనుభవించుకర్తయొక్క స్వభావమును తెలుసుకొన ప్రయత్నించెదము.

ఫిజియాలజీ అనగా దేహపరిశీలనా శాస్త్రము. మానవుడు ఒక మెదడుతోకూడిన విషయపూరిత ఆకారము. అతడు ఆలోచించి అనుభవింపగల శక్తికలిగి యున్నాడు అని తెలుపుచున్నది. ఈ పాశ్చాత్య నిర్ణితమునకన్న మన ప్రాచీన ఋషులు,

మనుష్యుని దైవీ స్థూల నిర్మిత శరీర విషయము తెలుపుట దీనికన్న ఉన్నత భావమును ప్రకటించుచున్నది.

కేవలము ఒక విషయపూరిత శరీరము, జీవాంశము ఒకటి లేకున్న - కదలదు, పెరుగదు, వ్యవహరింపజాలదు. ఒక మృతశరీరము నవ్వజాలదు, భుజింపజాలదు, నడువజాలదు, ఆలోచించజాలదు, అనుభవింపజాలదు. జీవము దేహమునుండి బైటికి ఎగిరిపోగా, శరీరము క్రిందపడిపోవును. కొంతకాలము గడచులోగా తాను ఏపంచభూతములనుండి ఉత్పన్నమాయెనో ఆ పంచభూతములలోనికి మురిగి జీర్ణమయి లయమగుచున్నది. మానవుడు జీవించియుండగా ఎట్టి మహనీయుడుగ నుండినను, ఇట్లు సంభవించుట సత్యము. మన ప్రతియొక్కరిలోనుండు ఇట్టి జీవ అంశము అను పుణ్యబిందువునుండి అన్ని వ్యవహారములు ఉత్పన్నములగుచున్నవి. అట్టి జీవాంశము ఈ స్వామిలో లేకున్న ఈ క్షణమునుండి అన్ని ఉపన్యాసములు ఆగిపోవలసియుండును. మీ రందరు ఈ మాటలను వినుచున్నారు, మనసులో విమర్శించుచున్నారు. బుద్ధిచే గ్రహించుచున్నారు. అట్టి జీవము మీ దేహమును, మనసును, బుద్ధిని తేజోవంతము చేయకుండిన యెడల ఈ కార్యములు ఏవియు జరుగజాలవు.

ఈ దివ్య అంశము తేజోవంత జీవబిందువును, వేదాంతమున ఆత్మయని తెలుపుచున్నారు. దీనిని అనేక తరతరముల స్థూలత్వముగల కోశములు ఆవరించుకొనియున్నవి. అన్నిటికన్న బాహ్యమున యుండునది స్థూలమైనది ఈ శరీరము. మన జాగ్రతావస్థ వ్యవహారముల నన్నిటిలోను, ఈ దేహమే నేను అను భావముతో పూర్తిగా వ్యవహరించుచున్నాము. సకృత్తుగా, మనలో కొందరు మానసిక వ్యక్తిత్వము, విజ్ఞాన వ్యక్తిత్వములు యున్నవని గమనించగలుగుచున్నాము. జీవిత కళాంశము, ఆనంద వ్యక్తిత్వము యొకటి యున్నదని మనలో ఎవరికిని అనుమానము కూడ యుండజాలదు. ఆత్మను ఓం అను సంజ్ఞతో తెలుపబడియున్నది. ఇది మన ఆత్మ లేక నిజస్వరూపము. సర్వశక్తి సర్వవ్యాపక స్వరూపము. ఈ జీవ కళను ప్రకృతి విషయ సముదాయము ఆవరించుకొని యున్నది. ఈ కప్పులను వేదాంతమున కోశములు అని తెలుపుచున్నారు. ఇచ్చట కోశమనగా ఒక కత్తికిని, కత్తి ఒరకు ఎట్టి సంపర్కము లేకయుండునో అట్లనే ఈ శాశ్వత దివ్య జీవిత కళకును, విషయములకును ఎట్టి సంపర్కమును లేదు. మరియు ఆ చైతన్యము యుండుటవల్లనే ఈ విషయ ఆవరణమునకు ఒక జీవకళ కలుగుచున్నది.

ఇట్లు అయిదు ప్రత్యేక కోశములు కనుగొనగలము. బాహ్య అన్నమయకోశము. దీనికి లోన పూతపూసినట్లు ప్రాణమయకోశము, అందులోగా మనోమయకోశము, మరిలోగా విజ్ఞానమయకోశము, కడకు సూక్ష్మతమమయిన ఆనందమయకోశము.

ఇచ్చట ఈ కోశముల వివరము తెలుసుకొనుటకు ముందు అంతరము అనగా ఏమిటో తెలుప ప్రయత్నించెదను. ఇచ్చట కోశము మరియొక కోశమునకు అంతరమున యున్నది అనిన ఒకదానికంటె మరియొకటి సూక్ష్మము అని అర్థము. ఒక కోశము యొక్క సూక్ష్మగుణము దాని వ్యాపకత్వమునుబట్టి తెలుసుకొనవలెను. ఒక మంచుగడ్డ యున్నది. అది ఆక్రమించు స్థలము నిర్ణయించగల కొంత పరిమాణము కలిగియున్నది. ఈ గడ్డను కరగచేసిన, నీరుగా మారి దానికన్న అనేక రెట్లు అధికమగు స్థలమును ఆక్రమించును. కనుక నీరు మంచుగడ్డకన్న సూక్ష్మమని వేదాంతమున వాడబడుచున్నది. ఆ నీటిని బాగుగా కాచి అది ఆవిరిఅయి ఒక గదినంతయు ఆక్రమించగలదు. కనుక ఆవిరి నీటికన్న సూక్ష్మమయినదని తెలుపబడుచున్నది.

ఇటులనే ఈ విషయపూరిత అన్నమయకోశమగు దేహము అన్నిటికన్న స్థూలమైనది. మనము పీల్చుగాలి ఈ దేహపరిమాణముకన్న అధిక స్థలమును ఆక్రమించగలదు. కనుక ప్రాణమయకోశము, అన్నమయకోశమునకన్న సూక్ష్మము. మన ప్రాణవాయువు

(948 పేజీ చూడుడు)

# సాహిత్యము — విజ్ఞానము

శ్రీమతి దాసరి శారద

సహితానాం భవః సాహిత్యము-సహితమనగా నన్నిటితోఁగూడినది. అన్నియనఁగానేమి? దీనిని పెద్దలిట్లనిరి.

సీ॥ "ఉచ్చారణ క్రియ నొప్పారు వర్ణంబు,
వర్ణసంచయమున వరలుఁ బదము
పదవితానంబున భాసిల్లు వాక్యంబు
వాక్య భేదమున, నివ్వటిలు నర్థ
మర్థవశంబున నమరును భావంబు
భావసంగతిఁగను పట్టురసము
రస సుప్రశస్తిచేఁ బొసఁగును బద్యంబు
పద్యరాశిని గూర్పఁ బడును గావ్యము.

ఇన్ని గూడినగాని కావ్యముకాదు.

అట్టి కావ్యములు సాహిత్య సంతతికిఁ జేరినవి. కావ్యములన నిచట గ్రంథ సామాన్య వాచకముగా గ్రహింపవలె.

"ధర సాహిత్యము గద్య పద్యము లనన్ దా,
రెండు భేదంబులై పరగున్"

అని అప్పకవి అనుశాసనము. కాన శ్రుతులు మొదలుకొని సుమతి శతకము వఱకు సాహిత్యములోఁ జేరినవే వాఙ్మయ మంతయును. సాహిత్యములేనివాఁడు గ్రంథరచన మొనర్పలేడు. సాహిత్యములో హెచ్చు తగ్గులుండవచ్చును. పిండికొద్ది రొట్టె; కాన ఎంత సాహిత్యమున్నదో అంత గ్రంథమే సిద్ధమగును. కాఁగా సాహిత్యము వలన నేర్పడిన వాఙ్మయమనేక విధములుగా నున్నది. ఈ వాఙ్మయ మంతయు దేశాభ్యుదయమునకే తోడ్పడుచున్నది.

కనుకనే పెద్దలు "విశ్వ శ్రేయః కావ్యమే" అనిరి. గ్రంథము విశ్వమునకుఁ దోడ్పడక యేమగును? ఆ గ్రంథములెన్ని రకములుగలవని వాకొనను? మన దృష్టికి గాని, మనస్సునకుఁగాని తెలియని యెన్ని విషయములు వాఙ్మయమున లేవు?

ప్రత్యక్షమునే నమ్మి తదితరముల నమ్మకున్నచో భారతీయ సంస్కృతి యడుగంటి పోవును. కించిద్‌జ్ఞుడవగుఁ నీ వెంత? నీ యనుభవమెంత? అతీంద్రియ ద్రష్టల వాఙ్మయము మనకెంత తోడ్పడుచున్నదో యెఱుగుదురా. పరలోకమున్నదో-లేదో! ఉన్నచో నెట్లున్నదో! ఎక్కడనున్నదో! ఎందుకున్నదో - ఎవరికొఱకున్నదో - ఈ కించిద్‌జ్ఞులము మన మాయెఱుగునది? అవ్విషయమునే వేదములు వేదాంతములు వాకొనుచున్నవి. అసలు నీవెవఁడవో - ఎచటినుండి వచ్చితివో - ఎచటికో నీ ప్రయాణము? ఇచట నేల కష్ట సుఖములు పడుచుంటివో - నీ వెఱుగుదువా? ఈ విషయమును గూర్చియే పూర్వ మునులు పరిశోధనములు చేసిరి. అవియే శాస్త్ర

ములు. కణాదుఁడు, గౌతముఁడు-కపిలుడు-పతంజలి - జైమిని - వ్యాసులు ఆత్మవిద్యను గూర్చియే చర్చించి శాస్త్రములు వ్రాసిరి. ఆ శాస్త్రములు దేశాభ్యుదయమున కెంత యుపయుక్తములో చెప్పనలవియా?

శాస్త్రములట్లుండుగాక, లౌకికముల విషయమో? అర్థశాస్త్రము - వ్యవసాయ శాస్త్రము - భౌతిక శాస్త్రము, రసాయనిక శాస్త్రము మున్నగునవి యెల్ల వాఙ్మయములో చేరినవే. ఇవి యన్నియు సాహిత్య సంపదలే. ఇవి దేశానికి దోడ్పడుచున్నవని తెలియనివారెవరు? సాహిత్యమనఁ గేవలం కావ్యమని పరిమితార్థమునే చెప్పరాదు. పాండిత్యమును విస్తరింపజేయునవి సంస్కృతముననను, నాంధ్రముననను నెంత వాఙ్మయములేదు? వాల్మీకి రామాయణము మొదటిది. అది అప్పటి దేశ చరిత్రనేనా! రాజుల చరిత్రనేనా-నీతులనేనా-సచ్ఛీలము నేనా? ఎన్ని విషయముల బోధింపదు? అందువలన నెందఱు తమ తమ నడవడిని చక్కదిద్దుకొనుటలేదు? రామాయణము చదివి "రామాదివ, త్ప్రవర్తితవ్యం - నరావణాదివత్" అని మనము నేర్చుకొనుటలేదా? అవ్వలవెలసిన వ్యాసుని పదునెనిమిది పురాణములు సాహిత్యసంపద కాదా? అందువలన నెంత లోకోపకారము జరుగుచున్నది.

కాళిదాసు రఘువంశ, కుమారసంభవ, మేఘదూతములు, వారి, శాకుంతలాది నాటక త్రయము, భవభూతి ఉత్తరరామ చరిత, మున్నగునవి సంస్కృత సాహిత్యము నెంత పోషించుచున్నవి?

ఇక తెలుగు చూతమా? భారతమును మించిన కల్పవృక్షమున్నదా? ఎందఱి కెన్నిరత్నము లందు దొరకవు? రామాయణము - భాగవతము మనపాలటి పెన్నిధులుగావా ?

నేడు కలముబట్టి వ్రాయువాడు పెద్దన మను చరిత్రను జదువకుండునా? భట్టుమూర్తి వసు చరిత్ర చదివిన నెంత సాహిత్యము పెంపొందును. తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యము ను విడిచియుండగలమా? ద్వ్యర్థికి రాఘవ పాండవీయము, హరిశ్చంద్ర నలోపాఖ్యానము మనకు తరగని బంగరు కొండలు గావా! శ్రీనాధుని గ్రంధములు మనకెంత సాహిత్య సంపదను పోగుచేసి పెట్టుచున్నవి? కృష్ణరాయల ఆముక్తమాల్యద భావముల రాశిని కుప్పపోయుచుంటలేదా? ఇట్లు కావ్యములేకాక శతకములో-మీలో సుమతి శతకము పద్యము రాని వాఁడున్నాఁడా? వేమన పద్యమును నాలుకపై పెట్టుకొనని వాఁడున్నాఁడా? ఇవి యన్నియు మన దేశాభ్యుదయమునకు దోడ్పడుచున్నవి.

విజ్ఞానము మాత్రము తోడ్పడదాయన వచ్చును? విద్య రెండు విధములు–జ్ఞానము, విజ్ఞానము అని. జ్ఞానము పెద్ద విషయము; ఆత్మకు సంబంధించినది. దానిని వదలి విజ్ఞానముందీసికొందము. విజ్ఞానమున సైన్సు –చిత్రకళలు – మున్నగునవి చేరినవి. ప్రస్తుతము సైన్సునకే విజ్ఞానపదము వాడుచున్నారు. కాశీపట్నము కొండయ్యగారు విజ్ఞాన పత్రికను నడుపుచుండిరి. అది యిప్పుడంతరించినదనుకొందును. సరే – సైన్సు దేశాభ్యుదయమునకు దోడ్పడదా? తోడ్పడును. తోడ్పడక పోదు.

సైన్సు విస్తరించినందువలననే, రైళ్ళు-కార్లు – రేడియోలు – విమానములు వచ్చినవి. ఇవి దేశాభ్యుదయమునకుఁ దోడ్పడుటలేదను పిచ్చివాడెవడుండును?

సైన్సు డెవలప్ అగుటచేతనే యాటంబాంబు, హైడ్రోజన్ బాంబు మున్నగు మారణాయుధములును వెలసినవి. ఇవియు దేశాభ్యుదయమునకు దోడ్పడుట లేదా? యని యడుగువారు నుండకపోరు. నేనను నదేమనగా ఈ సైన్సంతయు గ్రంథరూపమున నుండుటలేదా? పదార్థ విజ్ఞాన శాస్త్రములు గ్రంథములులేవా? ఎప్పుడైతే గ్రంథములున్నవో, అప్పుడే గుట్టుమట్టుగా సడీ చప్పుడు లేకుండ మా సాహిత్యములోనవి చేరిపోయినవి. కనుక సాహిత్యము దేశాభ్యుదయమునకుఁ దోడ్పడుచున్నదన్నచో విజ్ఞానముగూడఁ దోడ్పడుచున్నదని చెప్పినట్లే ఐనది. ఏలనన సాహిత్యములోనిదేగా విజ్ఞానము. విజ్ఞానము దేశమునకు దోడ్పడుచున్నదన్నచో అందు సాహిత్యములేదుగాన నమ్మాట చెల్లదు; కాని సాహిత్యములో నేకదేశమే విజ్ఞానము కాన సాహిత్యము తోడ్పడుచున్నదన్నచో విజ్ఞానము తోడ్పడుచున్నదన్న భావమువచ్చును. కాన విజ్ఞానముకంటె సాహిత్యమే దేశాభ్యుదయమునకు దోడ్పడుచున్నదని సిద్ధాంతము చేయుచున్నాను.



# ఎవరిదీ త్యాగం



శ్రీ చక్రవర్తి రంగస్వామి

మా అమ్మ చిన్నతనంలోనే చనిపోయింది. నాన్న చిన్న ఉద్యోగం చేస్తూవుండేవాడు. నన్ను పెంచే బాధ్యత మా అమ్మమ్మ చేతిలో వుండింది. మా అమ్మమ్మ నన్ను తన యింటికి తెచ్చుకొని పెంచింది. బడి చదువు పూర్తిచేయించింది.

మా నాన్న మళ్లీ పెళ్లిచేసుకొని ఆ జంజాటంలో పడిపోయి నా విషయంలో క్రమంగా శ్రద్ధ తగ్గించాడు. తరువాత కొన్ని ఏండ్లకు చనిపోయాడు.
నన్ను గురించి మా అమ్మమ్మ ఎప్పుడూ విచారపడుతుండేది. "పెండ్లియీడుపిల్ల, వొట్టి వెర్రిబాగులది. ఎలా ఒక యింటిదై తన యిల్లు చక్కబెట్టుకుంటుందో" అని.

మా అమ్మమ్మకు నామీద ఎంతో ప్రేమ. నన్ను చూచినప్పుడల్లా మా అమ్మను తలచుకొనేది. ప్రతి చిన్న విషయానికీ మా అమ్మతో పోల్చేది. నేను సుఖంగా సంసారం చేస్తుంటే తన పెత్తనంలో నా పిల్లలతో ముద్దుగా కాలక్షేపం చేయాలని కోరుతూ వుండేది.

ఇంట్లో నాకు ఏపనీ ఉండేదికాదు. నా చిన్ననాటి స్నేహితురాండ్రు అత్తవారిండ్లకు వెళ్ళిపోయారు. కాలం ఎంతకీ గడిచేదికాదు.

నాలోని వికసిస్తున్న యౌవనం స్పష్టంగా నాకు తెలుస్తూవుండేది ఆ రోజుల్లో. అద్దంలో చూచుకొంటూ నా కళ్ళల్లో, చెక్కిళ్లలో వస్తున్న అందమైన మార్పులను గుర్తిస్తూ ఉండేదాన్ని. నా శరీరం మీద శ్రద్ధ ఎక్కువకాసాగింది. అలంకరణకు మామూలుకంటె ఎక్కువ సమయాన్ని వినియోగిస్తూ ఉండేదాన్ని. మనస్సుకూడా చిత్రమైన మార్పులను పొందుతూ వుండేది.

◆ ◆ ◆

"అవ్వగారున్నారా" అంటూ నవ్వుముఖంతో ఒక రోజు సత్యం లోపలికి వచ్చాడు. గబగబా లోపలికివెళ్లి అమ్మమ్మను పిలుచుకు వచ్చాను.

"రావోయ్, సత్యం! రా, నాయనా!" అంటూ ఎంతో ప్రేమగా పలకరించింది. సత్యం తల్లి అంటే మా అమ్మమ్మకు ఎంతో ప్రేమ. కులంవేరైనా సత్యం తల్లిని మా అమ్మమ్మ మా అమ్మతోబాటు పెంచిందిట.

"అమ్మ ఎప్పుడూ మీ శారదను గురించే చెబుతూ వుంటుంది. శారద భారం అంతా మీమీదే పడిందనీ, మీకు శారదదే దిగులనీ అనుకుంటూ వుంటుంది" అంటూ నా వైపు సత్యం ఎంతో జాలిగా చూచాడు.

చదువుకోడానికి ఏవైనా పుస్తకాలు తెచ్చిపెట్టమని సత్యాన్ని అడిగాను. చిరునవ్వు నవ్వుతూ "సరే"నని వెళ్ళాడు.

సత్యం పొడుగ్గా అందంగా ఉంటాడు. తెలివైన కళ్ళు - నా కంటే కొంచెం పెద్దవాడు. చిన్నతనంలో నాతో ఆడుకుంటూ రోజులో చాలా భాగం మా యింట్లోనే గడిపేవాడు. ఒక్కొక్క పూట మా నడవాలో సత్యానికి అన్నం పెట్టేది మా అమ్మమ్మ. ఒక్కొక్క రోజు మా యింట్లో చిన్న నులకమంచంమీదే నిద్రపోయేవాడు.

సత్యంవాళ్ళు కలవాళ్లే. సత్యం పెద్దవాడై హైస్కూలులో చేరిన తరువాత మా యింటికి రావడం తగ్గించి, క్రమంగా మానేశాడు. వాళ్ల అమ్మ మాత్రం అప్పుడప్పుడూ వస్తూ ఉండేది.

సత్యం హైస్కూలు చదువు పూర్తి అయింది. ఇంటివద్ద భూములు చూచుకొంటూ రచయితగా

కృషి సాగిస్తూ ఉండేవాడు. చాలా రోజులయిం తరువాత మళ్ళీ మా యింటికి అదే రావటం.

ఆనాటినుంచి సత్యం మా యింటికి మళ్ళీ రాక పోకలు సాగించాడు. పుస్తకాలు తెచ్చియిస్తూ వుండేవాడు. పుస్తకాల గురించి తన అభిప్రాయాన్ని చెబుతూ వుండేవాడు. తాను వ్రాసిన గేయాలను, కథలను వినిపించేవాడు. అలాంటప్పుడు అతనిలో కొత్త ఉత్సాహోద్రేకాలు కనబడేవి. కొత్తవా డిలా మారిపోయేవాడు. సత్యం మాట్లాడుతున్న ప్పుడు ఎదటివాళ్లను చిత్రంగా ఆకర్షిస్తాడు. చది విన కథను అతను చేసుకున్నంత చక్కగా ఎవరైనా అర్థంచేసుకోగలరా అనిపించేది. ఒక్కొక్క సన్ని వేశాన్ని ఎంతో చక్కగా చిత్రిస్తూ మాట్లాడేవాడు. ఒకచిత్రాన్ని చూచివచ్చినప్పుడు ప్రతిపాత్రయొక్క సందేశాన్నీ విపులంగా చెప్పగలిగేవాడు. సత్యం అంటే నాకెంతో ఆదరాను రాగాలు కలిగాయి.

♦ ♦ ♦

ఒక రోజు సత్యం, నేను ఎదురెదురుగావున్న కుర్చీలలో కూర్చున్నాం. సంఘంలో స్త్రీల స్థితిని గూర్చి విచారిస్తూ మాట్లాడుతున్నాడు. స్త్రీలంటే తనకెంతో గౌరవం, సానుభూతీ ఉన్నాయని ఉద్రే కంతో వెల్లడించాడు. నా గురించి ప్రస్తావించి ఎంతో ఆవేదన ప్రకటించాడు.

ఔను, నాస్థితి ఎంత శోచనీయంగా ఉంది! ఇరవైయేండ్లు వచ్చినా పెండ్లి అయ్యే అవకాశాలు లేవు. తండ్రిలేదు; అమ్మమ్మకున్న ఆస్థి తిండికీ, గుడ్డకూ మాత్రం సరిపోతుంది. ఆమె కట్నాలూ, కానుకలూ యివ్వలేదు. రూపమూ, వయసూ ఉన్నంత మాత్రాన మా అసహాయ స్థితికి జాలిపడి నన్ను వివాహమాడడానికి ఏయువకుడు ముందుకు వస్తాడు?

"నేను నీకొరకు ఎంతైనా త్యాగం చేయగలను. కానీ మన వివాహానికి కులాల తేడా పెద్ద అడ్డుగా నిలచింది" అని నిట్టూర్పు విడిచాడు.

నేను అతని ఔదార్యానికి మంత్రముగ్ధురాలనై పోయాను. ఇతనిదెంత గొప్ప హృదయం! మా యిద్దరిమధ్యవున్న ఈ తేడావల్ల నేను సత్యాన్ని వివాహమాడితే సంఘదృష్టిలో ఎంతో హైన్యాన్ని నేనే అనుభవింపవలసి వస్తుంది - అగ్రవర్ణానికి చెందిన దానిని కావటంవల్ల ఈ మాత్రం త్యాగం చేసేందుకు చేయకూడదు? స్త్రీ జాతియందు యింత గౌరవం గల వ్యక్తితో నాకు స్నేహం ఏర్పడటం ఎంతైనా అదృష్టం.

నా యీ ఊహను అతనికి తెలిపాను. సత్యం ఆనందావేశాలకు అంతులేదు. మా జీవితాలలో ఆనందోత్సవం ఆనాటితో ప్రారంభమైంది. నా ప్రేమపూర్ణమైన హృదయాన్ని నిర్విచారంగా అతని చేతులలో ఉంచాను ఆనాడు. తన్మయత్వంతో అతని బాహువులలోకి వాలిపోయాను.

తరువాత అతను వ్రాసిన ప్రతి కవితలోనూ నారూపు, భావ సౌందర్యాలు అడుగడుగునా ప్రతి బింబించేవి. నలుమూలలనుంచి అతని కవితను అభి నందిస్తూ సందేశాలు రావటం మొదలు పెట్టాయి. పేరు బాగా వ్యాపించింది. సత్కారాలు ప్రారంభ మైనాయి. మా ప్రణయ సంబంధం దేశమంతటా తెలిసింది. రోజులు ఆనందంగా గడిచిపోతున్నాయి. మా అమ్మమ్మ మొదట సందేహించి ఎంతో కష్టం మీద నాకోసం యితర బాంధవ్యాన్నీ, సహజ గౌరవాన్నీ వదలుకొంది. సత్యం మా వివాహానికి యింకా సుముహూర్తం నిర్ణయించలేదు. ఆ విష యంలో నాకు సందేహమేమీలేదు. సంతోషంతో రోజులు నిమిషాలుగా గడచిపోతున్నాయి.

♦ ♦ ♦

నాలో కలుగుతున్న మార్పులను మా అమ్మమ్మ గమనించింది.

సత్యం, నేనూ కూర్చొని మాట్లాడుతుండగా మా అమ్మమ్మ వచ్చింది నెమ్మదిగా.

"నాయనా, సత్యం! పెండ్లికి యిక ఆలశ్యం కాగూడదు. రోజులు గడిస్తే ఆక్షేపణగా ఉంటుంది" అంది.

నాకు మనస్సులో సంతోషంగావున్నా పైకి సిగ్గనిపించింది. సత్యం కళ్ళలోకి చిరునవ్వుతో చూచాను. సత్యం గ్రహించాడు. ముఖాన్ని గంభీరంగా వుంచుకొన్నాడు. ఐనా అతని ముఖం వెలవెలా పోవటం గమనించాను.

◆ ◆ ◆

కాలవాహినిలో కొన్ని నెలలు దొర్లిపోయాయి. సత్యం మా యింటికి యిప్పుడు రావటంలేదు. మా అమ్మమ్మే వాళ్లయింటికి వెళ్లింది నడుము వంచుకొని బాధపడుతూ.

వాళ్లయింట్లో ఎవరూ పలకరించలేదు.

కళ్ల నీళ్లతో యింటికి తిరిగివచ్చింది. ఆమె నడుము విరిగినట్లనిపించింది నాకు చూడడానికి. దుఃఖంతో వణుకుతూ అన్నది "సత్యం యిక మనవాడు కాదమ్మా. మనల్ని అన్నివిధాలా అన్యాయంచేశాడు. ఇక ఏ నుయ్యోగొయ్యో చూచుకోవలసిందే. నువ్వు మోసపోయావని నాకు మొదటినుంచీ సందేహంగానే ఉంది." అని.

నాలో భరించరాని దుఃఖమూ, క్షోభా ప్రారంభమైనాయి. ఆత్మీయమైనదాన్ని పోగొట్టుకొన్న పిచ్చిదానిలా అయిపోయాను. ధైర్యాన్ని తెచ్చుకోడానికి తీవ్రంగా ప్రయత్నించాను. ఏ మాత్రం కృంగిపోదలచుకోలేదు. మనసు గట్టి చేసుకున్నాను. వెలికి ఎలానూ ధైర్యంగా ఎదుర్కొంటున్నాముగదా.... పిరికితనంవల్ల కూడనిపని చేయదలచుకోలేదు. నేనే అమ్మమ్మకు ధైర్యం చెబుతున్నాను! కాలచక్రం ఘోరంగా తిరుగుతోంది.

◆ ◆ ◆

తెల్లవారుతూన్న వెలుతురులో అప్పుడే స్నానం చేయించబడ్డ బంగారు పాపను మంత్రసాని నీరసంగా పండుకొని వున్న నా పక్కనే ఉంచింది. మంత్రసానీ, అమ్మమ్మ గుసగుసలాడి నా వైపు బెదురుగా చూచారు. బిడ్డను ఎవరికైనా యిచ్చేద్దామని వాళ్ల ఆలోచన అయివుండవచ్చు! ఎట్టి చెడ్డ ఆలోచనా చేయవద్దని గట్టిగా మందలించాను నేను.

◆ ◆ ◆

పాప నవ్వుతోంది. బోర్ల పడుతోంది. 'శకుంతల' అని మా అమ్మ పేరు పెట్టుకున్నాం.

సత్యం ఎప్పుడైనా పొరపాటుగా మా యింటి ముందుగా వెళ్లుతూ మా యింటివైపు చూచేవాడు. నేను పలకరించడానికి ప్రయత్నించేదాన్ని. అతను అవకాశం యివ్వకుండా తప్పించుకపోయేవాడు. ఎంత పిరికితనం!

కొంతకాలానికి సత్యం పెద్దకట్నంతో పెళ్లిచేసుకొన్నాడనీ, భూములు కవులుకిచ్చి, ఉద్యోగం చూచుకొన్నాడనీ, యీ వూళ్లో వుండటంలేదనీ తెలిసింది.

◆ ◆ ◆

మా పాపకు అప్పుడప్పుడు వైద్యం అవసరమైనప్పుడు మా వూరికి క్రొత్తగా వచ్చిన డాక్టర్ కృష్ణకు చూపిస్తూవుండేదాన్ని.

కృష్ణ చాలా మంచివాడని అనుకునేవాళ్లు. చిత్రమైన యువకుడు. క్షణంలో పసిబిడ్డలతో స్నేహం చేసుకొనేవాడు! పాపలతో ఆడుకొనేవాడు! పాపల చేత నిమిషంలో పాటలు అల్లించేవాడు.

రోగుల మీద దయ ఒలకపోసేవాడు. హాస్యంతో; నవ్వులతో ఆస్పత్రి ప్రతిధ్వనిస్తూ ఉండేది.

ఒకసారి మా పాపకు ప్రమాదంగా న్యుమోనియా వచ్చింది. ఇంటికివచ్చి పాపను చూచి శ్రద్ధగా వైద్యం చెయ్యమని మా అమ్మమ్మ వెళ్లి డాక్టరును బ్రతిమలాడింది. కృష్ణ సైకిల్ మీద రోజూవచ్చి పాపను శ్రద్ధగా చూస్తుండేవాడు. జబ్బు తిరుగు ముఖంపట్టింది.

ఒకనాడు మా కుటుంబ పరిస్థితులనుగురించి అడిగాడు.

నేను నా కథ జరిగింది జరిగినట్లుగా, కండ్లకు కట్టినట్టు చెప్పాను.

నా కథ విన్నాక డాక్టరు అసహ్యించుకుంటాడని నా భయం! మమ్మల్ని గురించి అతను చెడ్డగా విని వుంటాడని మా నమ్మకం.

నేను కృష్ణవైపు చూచాను. ఎంత చిత్రమైన మార్పు! చలించిపోయి కన్నీరు కారుస్తున్నాడు! ఎంత సుకుమారమైన మనస్సు! ఆశ్చర్యపోయాను.
కృష్ణ నాదగ్గరగా వచ్చి నిల్చున్నాడు. నా కళ్లలోకి కన్నీరుతో చూచాడు. నేను ప్రశాంతంగా నిల్చునివున్నాను.

"నేను మీగురించి చెడ్డగా విన్నాను. ఇప్పుడు విన్నాక నిజం తెలుసుకున్నాను. మీలో చంచలతగానీ, పిరికితనంగానీ, అసత్యంగానీ లేవు. పాపం, సత్యం భయపడి రత్నాన్ని వదిలి పారిపోయాడు. జీవితం ఆటకాదని తెలుసుకోలేకపోయాడు! నేనింతవరకు వివాహంచేసుకోలేదు. సాంప్రదాయానికీ, ధనానికీ లోటులేదు. అమూల్యమైన రత్నానికి విలువ కట్టటంలో నేనెవరికీ భయపడను. మీకు అభ్యంతరం లేకపోతే మిమ్మల్ని వివాహం చేసుకుంటాను." అంటూ ప్రవాహంలా చెప్పుక పోతున్నాడు.

నేను వివశనైపోతున్నాను. కళ్లు మాతలు పడుతుండగా యిలా అనగలిగాను "మీరు నన్ను... నన్ను వివాహం చేసుకుంటారా"

"ఔను. మీ పవిత్రప్రేమ చిహ్నమైన పాపను పెంచి మంచి భవిష్యత్తునిద్దాం. అమలినప్రేమ, అద్భుత సహనం మీలో దీప్తివంతంగా వెలుగుతున్నాయి."

తూలిపోతున్న నా శరీరాన్ని, నా హృదయంతోబాటు ఆప్యాయంగా కృష్ణ తన బాహువుల్లోకి తీసుకోడం లీలగా మనస్సుకు తెలుస్తూనేఉంది.

♦ ♦ ♦

నేను సత్యాన్ని అతని తప్పిదానికి పూర్తిగా మన్నించి అతనిని మరచిపోడానికి నిశ్చయించుకున్నాను.

మొదటిసారి ప్రేమించినంతటి గాఢంగానూ, నిర్మలంగానూ ప్రేమించగలిగాను కృష్ణను. నా హృదయాన్ని పూర్తిగా అతని ప్రేమతో నింపుకున్నాను.

♦ ♦ ♦

నేనూ, కృష్ణా రిజష్టరు వివాహం చేసుకొని రాత్రి రైలులో తిరిగివచ్చాము.

ఉదయాన్నే అతని కారులో యింటికి వెళ్లుతున్నాం. కృష్ణ డ్రైవ్ చేస్తున్నాడు. ప్రభాత సూర్యుడు ప్రకృతి దేవతను బంగారంతో అలంకరిస్తున్నాడనిపించింది. పక్షులు కలకలారావాలు చేస్తున్నాయి. ఉదయ వాయువులు ఆహ్లాదకరంగా వీస్తున్నాయి. ఇంతలో యింటిముందు ఆగింది కారు. తెల్లవారుతూనే నిద్రలేచే అలవాటుగల పాపా, అమ్మమ్మా మా దంపతులకు నవ్వుతూ హృదయపూర్వకంగా స్వాగతం యిచ్చారు.



# వివిధ దేశాల

## విజ్ఞాన వినోదాలు

'యం. యస్. యస్.'



హృదయం ఒక పసిపాప వంటిది; అది చూసిందల్లా కావాలంటుంది. (టర్కీ)

కళ్లు మూసుకున్న వాళ్లంతా నిద్దరోతున్నట్టు కాదు. (జర్మనీ)

మంచివాడైనా సరే జర్మనీవాడిని ఉరి తీసెయ్యి. (రష్యా)

పలువురు మెచ్చింది పాట; పది చెట్లున్నది తోట. (తెలుగు)

బలం అనేది హక్కును లెక్క చెయ్యదు. (ఫ్రాన్సు)

అంధుడికి రాత్రి అయినా ఒకటే; పగలు అయినా ఒకటే (కాశ్మీర్)

పానీయం ప్రవేశించడమేమిటి - విజ్ఞానం వైదొలగడమేమిటి! (స్పెయిన్)

కాకి లేని ఊరు ;
పాపి లేని ఊరు. (అరవం)

ఆడపిల్లల్ని పెంచి పెద్ద చెయ్యడం సులువే; పెళ్లి చెయ్యడమే కష్టం (జర్మనీ)

ఈ లోకం ఒక పెద్ద మర; అది విసిరినన్నాళ్లు పిండి విసురుతుంది; ఎప్పుడో ఒక నాడు మనల్ని నమిలేస్తుంది. (టర్కీ)

కుక్కలు మొరిగే ప్రతీ మనిషీ దొంగ కాడు. (రష్యా)

పెట్టి పోసిననాడె చుట్టాల రాకడ, కలిమి వేళనె వారకాంత వలపు. (వేణుగోపాల శతకము)

కొనుక్కొనే వాడికి నూరు కన్నులయినా చాలవు; అమ్ముకొనే వాడికి ఒక్క నేత్రమే చాలు. (ఇటలీ)

నిన్ను నువ్వు జయించుకోవడమే నువ్వు పాల్గొనే గొప్పయుద్ధం. (అరేబియా)

కురాన్ చంకలో పెట్టుకొని ఎద్దు మీద కన్ను వేసినట్టు. (ఆఫ్ఘనిస్థాన్)

మనిషి కురూపి అయితే అద్దం ఏం చెయ్యగలదు? (అరవం)

ఒక నుయ్యి పూడ్చవచ్చు గాని నోరు మూయించలేము. (నీలగిరి)

కస్తూరీ, మోహమూ ఎంత దాచినా దాగవు (పర్షియా)

పళ్లు అనేవి ఉంటే కప్పకూడా కరవబోతుంది. (ఇటలీ)

పుట్టింటిమీది ఆశా, ఆముదం మీది జిడ్డూ పోవు. (తెలుగు)

# ఏకోదరులు

రచయిత :
గోథేమహాకవి

అనువాదము :
డాక్టరు వి. ఎన్. శర్మ

(గతసంచిక తరువాయి)

(మూడో రంగం)

(విల్‌హెం ఇంట్లో, విల్‌హెం ఒంటరిగా వుంటాడు. కోపం, విచారం అతన్ని పీల్చి పిప్పి చేస్తాయి)

విల్‌హెం:—సెలవు పుచ్చుకొని వెళ్తావా ? వెళ్లు, తప్పక వెళ్లు. అలా వెళ్ళిపోతే కంగారుపడతా ననుకొన్నావా ? ... మరియానాను తీసుకొని వెళ్ళాలనేనా నీవుద్దేశ్యం ? ... అలా చేస్తేవా, ... నా భాగ్యదేవతనే తీసుకొని వెళ్ళదలం చావా మరి ? ... దాంతో నా జీవితమే చిందర వందరైపోతుంది. ... అదే నాకు అండగా నిలు స్తుందని ఇంతవరకూ సంతోషపడుతున్నాను. అదీ పోయిందా - భవిష్యత్తంతా సున్న ... ... పో, పో, నీవు ద్రోహివి. నా మంచితనాన్ని ... నేనిచ్చిన ఆతిథ్యానికి కృతఘ్నుడవయ్యావు ... (నిట్టూర్పు విడుస్తూ) ఏమంటున్నాను ? ... ఫాబ్రిస్ వుదారుడు. నేనంటే అతనికి పంచ ప్రాణాలు లేచివస్తాయ్. అతడినేనా ఈలా నిందించటం ? పాపం ! అతడేం చేశాడని యిలా దుయ్యబట్టడం ? ... ... ఆ మాట విన్నాక మనసు చివుక్కుమంది ... అయితేనేం, అలా మిత్రుణ్ణి దూషించటమా ? ఫాబ్రిస్ ! నన్ను క్షమించాలి. ... అంతా నా తప్పే ! ఎంత బాధ పెట్టాను ? నీ సంగతి నాకు బాగా తెలుసు. మరియానాను అంత గాఢంగా ప్రేమి స్తున్నావని ఆనాడే గుర్తించాను. ఆ పిల్లా నీ వంటే వుబ్బి తబ్బిబ్బయి పోతున్నది. మీ ప్రేమ పాశాల్ని తెగగొట్టడం మానవ మాత్రులకు సుల భమా మరి ? దానికోసం ఇంత రభసచేయటం సబబుకాదు. ... మరియానాను పోగొట్టు కొంటాను. అయితేనేం ? మరియానా భవిష్య త్తును ఆలోచించాలి. ఎన్ని బాధల్ని ఎదు ర్కోవాలసివచ్చినా, - అదే ఈ జీవితంలో, ఈ కష్టపరంపరల్లో నాకు ఎంతో అండగా వుంటున్న ఆ పిల్ల సౌఖ్యాన్ని గురించి ఆలోచించాలి. ...

[మరియానా ప్రవేశిస్తుంది]

మరియానా:—అన్నయ్యా ! వచ్చావా ? ఆయనేడీ ?

విల్ :—(విచారంతో) ఫాబ్రిస్సా ! ... ఊఁ ! ...

మరి:—అంటే ? ... ఆయన చెప్పాడా ? ... ఎందు కాలా విచారంగా వున్నావు ? ... అంతా మన మంచికే వచ్చిందని అనుకొన్నాను ...

విల్ :—ఏం అనుకొన్నావమ్మా ?

మరి:—(సిగ్గుతో) ఆయన దాన్నంతా చెప్పినా ... ఆ మాటను తలచుకొంటే నాకే ఆశ్చర్యంగావుంది.

విల్ :—(ఆతురతతో) ఆలా చేయటంలో వింతేముంది?

మరి:—ఆయన్ని పెళ్లి చేసుకోను ...

విల్ :—నీవు చెప్పేది అర్థం అవటంలేదు ...

మరి:—ఆ సంగతి ఆయనికి చెప్పానుకాను. దాన్ని వింటే ఆయన కంగారైపోతాడు. కాని ... కాని ... ఆయన్ని పెళ్లాడను. అంతే. ...

విల్ :—(నిట్టూర్పు విడుస్తూ) ఎందుకమ్మా ఆలా అంటావు ?

మరి:—ఆయన మంచివాడే. మన శ్రేయస్సును వాంఛించేవాడే. ... ప్రాధేయపడ్డాడు. ఆ కంగా రును చూచాక ... ... ఈ సంఘటన మనమేలుకు మంచిదో ... ఏం అనగలుగుతాను ? ... నిన్నే

అడగమని ... కాని తరువాత ఆ సంగతినే ఆలోచించాను. ఇట్టి సంఘటన మంచిదికాదు ... ఏమంటావు ?

విల్:—నాతో ఆ సంగతినే ప్రస్తావించాడు. కాని దాన్ని విన్నాక ఒళ్ళు మండిపోయింది.

మరి:—ఆ సంగతిని పూర్తిగా మరచిపోవాలి. ... ఒకటే చెబుతాను ... నేను జీవించటం నీ కోసం. నిన్నే ప్రేమించాను. నీ సేవలోనే నా జీవితాన్నంత గడపాలి. అప్పుడే దీన్ని కార్యరూపాన చూపెట్టడానికి అవకాశ భాగ్యం లభిస్తుంది ... అంతకన్నా నాకు మరేం కావాలి ?

విల్:—(తనలో) నేనంటే ఈ పిల్లకు ఎంత మమకారం. దేవా ! సందిగ్ధావస్థలో మునిగి తేలుతున్నాం. మమ్మల్ని ఒక దోవకు తీసుకొనివచ్చే భారమంతా నీదే. నీవుకాక మరెవరు ... ...

మరి:—అన్నయ్యా ! నీవీలా క్షోభపడటం చూస్తూ వుంటే ... ... ఆ సంగతిని మరచిపోదాం. పూర్తిగా మరచిపోదాం ... ఆయన వుదార స్వభావంకలవాడు. ఆయనా, దీన్ని అర్థం చేసుకొన్నాక ఏం అనడు. ... జరిగిందేమో జరిగిపోయింది. పూర్వంవలె మనమూ ఆయనపట్ల స్నేహభావంతో వుండాలి. ... నిన్ను విడిచి వెళ్తాననుకొన్నావా ? ఆలా చేయటం అసంభవం. నీ దాన్ని నేను. ఈ జీవితాన్నంతా నీకే సమర్పించాను. ఇక ముందూ దీన్ని నిర్విఘ్నంగా నిలుపుకోవాలి.

ల్:—ఆలా చేయడం ... ...

మరి:—నిన్నే ప్రేమించాను. అంచేత ఇతర కోరికలు మనస్సులోవున్నా ... అన్నిటినీ నీ కోసం త్యజించాలి. అందేం దోషంవుంది ? ... జీవితంలో ఇట్టి ఘట్టాలు ఎదుర్కోవాలసి వుంటుంది ... ఆ నాడు మనవూళ్ళో ఆ మంటల్ని కన్నులార చూచాంకదూ ? మొదట పొగ, పొగ తరువాత గాలి వచ్చింది. దాంతో మంటలు అన్నివైపులా వ్యాపించాయి. ఇల్లు మండిపోయింది. మిగిలిపోయింది బొగ్గులూ, బూడిదా ... జీవితం కూడా అంతే ... ఈ జన్మలో నిన్ను ఎన్నటికీ వదలిపోను. ... నన్ను మాత్రం ఆ పని చేయ్యనీయవద్దు. ఇదే నా కోరిక. ...

విల్:—(వీపుమీద చెయ్యివేస్తూ) అమ్మాయి ! నా సుఖాన్ని తలంచుకొంటే లాభం వుంటుందా ? నీ సంగతో ? ఎంతకాలం ఈలా వుండదలచావు ? ...

మరి:—నీవూ ఆలాగంటుంటే ! ... నీవు పెండ్లిచేసుకో వద్దు. ఈ వయస్సులో ఆ బాదరబందీ నీకెందుకు వచ్చింది మరి ? ... నీ పోషణం అంతా చూచుకొనే భారం నామీదే వుంచివేయాలి. ... మన పొరుగింట్లో సంగతి ఆలోచించుమరి ? ... వాళ్ళు ఏకోదరులు. వాళ్ళవలె మనమూ ఈ జీవిత గథాన్ని హాయిగా నడుపుకోవచ్చు. వాళ్ళ వలె నేనూ నిన్నే చూచుకొంటూ ఆనందంగా కాలాన్ని గడుపుకొంటాను.

విల్:—(తనలో) ఈ పిల్లకున్నంత గుండె నిబ్బరం నాకూ వుంటేనో ... ... ఆలా కలిసిమెలసి వుండే అదృష్టం వుంటుందా, దేవా! దేవా! ...

మరి:—(నిట్టూర్పు విడుస్తూ) అన్నయ్యా ! నా విషయాన నీవేం బాధపడనక్కరలేదు. ... ... కాని ... ఇవ్వాళ కాకపోతే, రేపో, ఎల్లుండో మరొక స్త్రీని పెళ్ళిచేసుకొంటావు. ... ఆ సంగతినే తలుస్తూవుంటే ... నీవు తప్పక పెళ్ళాడాలి. ... ఇద్దర్నీ ప్రేమించాలని నా ఆశ. ... ... కాని, నేను ప్రేమించినట్లు, ఆవిడ నిన్ను ప్రేమించ గలుగుతుందా ?

విల్:—(నిస్పృహతో ... జవాబు చెప్పబోతాడు. కాని నోటినుంచి మాటరాదు.)

మరి:—(తబ్బిబ్బుతో) అన్నయ్యా ! నీవాలా బాధపడటం చూస్తూవుంటే నాకే కష్టంగావుంది. నీ

సంగతి నాకు తెలియదనుకొన్నావా? స్వభావ రీత్యా నువ్వు ఎప్పుడూ వెనక్కు వంగే మనిషివి. ఆ సంగతినే ఇంతకాలంనుంచీ చెప్పదలచాను. ధైర్యంవుంటేకదూ! ఇవ్వాళ ఇంత సాహసం చేసి చెప్పినందుకు ... ...

విల్:—చెప్పిందేమో చెప్పేశావు? ఇంకేం చెప్ప నవసరంలేదు.

మరి:—కొంచెం వోపిక పట్టుకోవాలి. చెప్పదలచిందంతా పూర్తిగా చెప్పనీయాలి ... ఆవిడై వచ్చిందా ... నా పని వంటింట్లోనేకదూ? ఆలా వుండటం నాకూ ఇష్టమే. కాని ... అప్పుడప్పుడు నిన్ను చూడాలని నీతో మాట్లాడాలని ఆశ వుంటుంది. ఆ సంగతి నీకు చెప్పడం అనవసరం కదూ? అయినా ... ...

విల్:—(పిల్లవంక ఎగాదిగా చూస్తాడు. మాట్లాడడు.)

మరి:—మా అమ్మ చనిపోయినప్పటినుంచీ నీ పోషణలోనే పెరిగాను. ... ఇప్పుడు నిన్ను వదలి ఎక్కడికి వెళ్లేది? ఇక ముందూ నీ అడుపాజుల్లో వుండాలనే నా కోరిక. ... నా హృదయాన్ని నీకే సమర్పించుకొన్నాను. నేనూ నీ దాన్నే అయిపోయాను ... కాని ఇప్పుడో? ఆ తలపులు ఎందుకు వచ్చాయో? నీవూ నన్ను వదిలేసి నీ లోకంలోనే వుండాలని వుర్రూతలూగుతున్నావు. ... మగవాళ్ల వైఖరి ఇంతే. ఇట్టి చిత్రాల్ని నేను చూడటంలేదా? దానికోసం నానా రభస చేస్తారు. తుదకు ప్రాణాల్నే పోగొట్టుకొంటారు. ...

విల్:—ఎందుకాలా అంటావు చెప్మా?

మరి:—మనసులోవున్న సంగతిని చెప్పాలి. ఆలా చెప్పకపోతే శాంతి అనేది ఎలా వస్తుంది? స్త్రీలూ వాళ్లకన్నా ఈ విషయంలో ఎక్కువ చదివినవాళ్లే! స్త్రీ అందచందాలతో తులతూగివుండాలని వాంఛించటం వాళ్లి స్వభావమే. నేనూ ఆలాగే వుండదలచాను. చిన్నప్పుడు ఈ సమస్యల్ని అర్థంచేసుకొనే దాన్ని కాదు. ... అయినా కష్టాలు తండోప తండాలుగా వస్తున్నాయి. వాటినుంచి బయటపడాలి.

విల్:—(ఆత్రంతో) నిన్ను బాధించే బాధనంతా పూర్తిగా చెప్పేశయ్యాలి.

మరి:—అవును బాధే. ఎంత బాధ పడుతూవున్నా ఇద్దరం ఆ ఏకోదర్లమాదిరి కలిసిమెలసి వుండాలనే నా కోరిక. ... ఈ మధ్యనే ఒక కథను చదివాను. ఆ అమ్మాయి ఇట్టి ఘట్టాన్నే తన జీవితంలో ఎదుర్కోవాలసి వచ్చింది. దాంతో ఆ పిల్లపడ్డ క్షోభను తలుస్తూవుంటే నా గుండె గుభీలుమంటున్నది ... (ఆ వుద్రేకాన్ని ఆపుకోలేక ఏడుస్తుంది.)

విల్:—(లాలిస్తూ) మరియానా! నీవు చదివింది కథ. దానికోసం ఈలా క్షోభపడటమా? ...

మరి:—విల్హెం! నీవాలా చేయవద్దు. ఆ పిల్ల ఆయన్ని వదలిపెట్టి వెళ్లాలసివచ్చింది ... కాని నీవు అటువంటి కఠినుడివికావు. నిన్ను విడిచిపెట్టి వెళ్ళను. నీవు పెళ్లిచేసుకొన్నా, నీ దగ్గర వుంటాను. నీవు నా వాడివి. నీవుతప్ప మరెవ్వరున్నారు ఈ లోకంలో. ...

[ఫాబ్రిస్ లోనికి ప్రవేశిస్తాడు]

మరి:—ఆయనా తగిన సమయానికే వచ్చారు. ... (ఫాబ్రిస్ వంక విచారవదనంతో చూస్తూ) మీరు ఇప్పుడు రావడం మంచిదే. మీరు మంచివారే. మీ ఋణాన్ని ఎలా తీర్చుకొంటామో ... కాని మీ వాంఛను మాత్రం నెరవేర్చజాలను. అలా అనటానికి సాహసించినందుకు నన్ను క్షమించాలి. ... అయినా పూర్వంవలె మమ్మల్ని ఆదరించే బాధ్యత మీదే. ఇదే నా కోరిక.

ఫాబ్రిస్:—(విచారంతో) ఆ సంగతి నీవు చెప్పాలా మరియానా! ఆ మాట అన్నప్పుడే ఈలా విషమిస్తుందని అనుకొన్నాను. విల్హెం నీవాడు.

ఆయన్ని ఎలా వదలిపెట్టగల్గుతావ్ ? ... మీతో కలిసి మెలసి వుండాలని వాంఛించాను. కాని ... అంతా మన్నుపాలు. దాన్ని మార్చటం మనుష్య మాత్రులకు సులభసాధ్యమా?...వోడిపోయాను. దాన్ని అంగీకరించాలి. ...

విల్ :—(ఉద్రేకంతో) నీవాలా అనటం బాగాలేదు. నీ మనోవాంఛల్ని చంపుకోడం సబబుగాలేదు. ఈ జీవితంలో ఎన్నో కార్యాల్ని చక్కబెట్టుకోటానికి మనం పుట్టాం. అది పావనకార్యం. దాన్ని చెడగొట్టుకోడం మనుష్య నైజానికే కళంకం. ... నేనెవర్నో, తనెవరో, ఆ పిల్లకు తెలియదు. అదే మరియానాకు తెలిసివుంటే ...

ఫా:—(నిట్టూర్పు విడుస్తూ) ఆ సంగతిని చెప్పావు కావా ?

మరి:—(ఆత్రంతో) ఏమిటా రహస్యం? ఏం తెలియదంటావు అన్నయ్యా! ...

విల్ హెం:—(మాట్లాడడు)

ఫా:—(ఆశ్చర్యంతో) మరియానాకు బొత్తిగా తెలియదా!

విల్ :—(తటపటాయిస్తూ) ఆ పిల్లకు తెలియదు.

ఫా:-అలాచేస్తే ... ...

మరి:—అన్నయ్యా! మీ భాష నాకు అర్థం అవటం లేదు ? ఏమిటా రహస్యం మరి? నాకు చెప్పటానికి ... ...

విల్ :—(లాలిస్తూ) అమ్మాయి! నీవు నాదానివి. ఆ రహస్యం చెప్పటానికి సాహసం లేకపోయింది.

మరి:—అంటే ... ముద్దియ్యమంటావా? లేక ...

విల్ :—నీ జీవితాన్నే పరమపావనంచేసే ముద్దు . నాకీయవద్దు. నేను నీ అన్నను కాను. (అమ్మాయి కాళ్ళను పట్టుకొని) చార్లొటా, - నా చార్లొటా నీ తల్లి. నీవు నా కుమార్తెవు ... ...

మరి:—(కంగారుగా) ఆ సంగతి ఎందుకు దాచావు మరి? ...

విల్ :—(విచారంతో) అది విధికృతం. దాన్ని మార్చటం మన తరమా ... ఫాబ్రిస్ నీ వాడు. అతణ్ణి ప్రేమించావు. ... అతని మనోవాంఛను తెంచివేయవద్దు. ఇదే నా కోరికా ...

మరి:—అతణ్ణి ఎలా ప్రేమించేది? ...

ఫా:—భగవానుడు వున్నాడు. ఆయన నిర్ణయం ప్రకారం అంతా జరిగిపోతుంది. మనం దాన్ని తెగద్రోయటం శక్యమా మరి? ... మరియానా! మీ రిద్దరూ సావధానంగా ఆలోచించుకోవాలి. తొందరేమీలేదు. ... ...

మరి:—(ఫాబ్రిస్ వంక విచారవదనంతో చూస్తూ) అలా జరగటం అసంభవం. అక్షరాలా అసంభవం...

విల్ :—మరియానా! మరియానా! అలా అనవచ్చునా? ...

మరి:—(విల్ హెంను ఆలింగనంచేస్తూ) నాయనా! ఇంతకాలం దాచివుంచిన రహస్యాన్ని చెప్పివేశావు. నాకు పెళ్ళివద్దు. ముమ్మాటికీవద్దు. నీ దగ్గరే వుంటాను. నీ పరిచర్యను చేసుకొంటూ వుండాలి. అప్పుడే నాకు తృప్తి. మనశ్శాంతి అప్పుడే వస్తుంది. అంతకన్నా మరేం కావాలి. ఈ జీవితంలో నీకు అండగా వుంటాను. ఆయన్ని పెళ్ళిచేసుకోవడం అనేది ఎన్నటికీ జరుగదు. అట్టి ఆశను ఏమాత్రం మనస్సులో వుంచుకోవద్దు.

(సశేషం)

———o———

# అన్నా! చెల్లాయ్!

శ్రీమతి చర్ల సత్యవతి

మోహనుడా సంవత్సరమే కళాశాలలో చేరాడు. చేరి రెండునెల్లే అయినా "పుష్ప పుడుతూండగానే పరిమళిస్తుం దన్నట్లు'' అతను కాలేజీలో తెలివైన వాడుగా కనబడ్డాడు. అన్నింటిలోనూ ఆరి తేరినట్టే ఆటల్లోకూడ శ్రద్ధ ఉన్నవాడు. ''క్రికెట్'' ఆట అంటే మహా చెడ్డ ప్రీతి. ప్రతిరోజూ కాలేజీవదలగానే అతను 'క్రికెట్ ఫీల్డ్'లో కనబడతాడు.

మామూలుప్రకారం రాక అతడానాడు క్రికెట్టునుంచి కొంచెం ఆలస్యంగా వచ్చాడు లాడ్జికి బంట్రోతు సాయంతో. గుమ్మం లోంచి బంట్రోతుని పొమ్మని గోడ సాయంగా తన గదివద్దకు కుంటుతూ పోతున్నాడు.

''ఏమండీ! ఆటలో దెబ్బతగిలిందా?'' అని ప్రశ్నించిందో యువతి మృదువుగా విచారసూచకంగా.

''మరే! సుశీలా...''అని వెనక్కితిరిగి జవాబిచ్చాడు మోహన్.

"గట్టి దెబ్బ తగిలిందేమండీ?''అని మళ్ళీ ప్రశ్నించింది.

''కాస్త గట్టిగానే అందులోనూ 'క్రికెట్ బాల్' కాదండీ,'' అని వెనక్కితిరిగి గదిలోకివెళ్లి మంచంమీదవాలాడు. అతని మెదడులో రెక్క పరుగెత్త సాగినట్. సుశీలను తనంటే అంతప్రేమ యెందుకో? తానక్కడ ప్రవేశించినప్పటినుంచీ సుశీల రోజూ ఓ సారి అతనితో మాట్లాడు తూండేది. అయితే ఈ నాడామె చూపినంత ఆదరం యిదివరలో అతనికి కనపడలేదు. అప్పుడే అతనిలో యింకో ఆలోచన రేకెత్తింది. అసలు సుశీలకి పెళ్లయియుం టుందా. అయితే యింత పెద్దదయినా కాపరానికి వెళ్లకపోవడమేమిటి? అథమం భర్తైనా యీ మధ్య వచ్చినట్లులేదే? చది విస్తేవున్నమతి పోయినట్టు ఆమె మెళ్లో మంగళ సూత్రాలు కనిపిస్తోంటే పెళ్లవక పోవడమేమిటి! అయింది. పెళ్లయింది. అయితే వీరిద్దరికీ యేమైనా మానసిక కలహాలున్నాయేమో! అదీ అంత సమంజ సంగాలేదు. ఛా! ఆ గొడవలన్నీ యెందుకు- ఆమెను నేను ప్రేమిస్తున్నాను - నన్నామె ప్రేమిస్తోంది. అంతే-అంతకన్న ఏం కావాలి? సుశీల నన్నాకర్షించింది. ఆకర్షించకపోతే ఎందుకంత చనువుగా మాట్లాడుతుంది. ఆమె తత్వమే అంతేమో? ఛా! అదంతా సనాతనం. ఏమవనీ-అమెననుభవించాలి. చేతికందిన సౌఖ్యరాశిని యేల కాదనాలి!

అంటూ నిద్రలో మునిగాడు.

నాల్గు రోజుల్లో కాలునొప్పితీసింది. గదిలో కూర్చుని వారపత్రిక పేజీలుత్రిప్పు తున్నాడు. దృష్టంతా సుశీలమీదే ఉంది. సుశీల అందరితోనూ క్రొత్త, పాతలేకుండా మాట్లాడుతోవుంటుంది. మగ, ఆడ వివక్షత లేకుండా ప్రతివ్యక్తితోటి ఎంతో చనువుగా వుంటుంది. కొద్దిగా చదువు కుందికూడా. నవలలంటే మహా చెడ్డ యిష్టం. ఎప్పుడూ ఏదో ఒక పుస్తకం చదువుతూనే వుంటుంది. అప్పుడప్పుడూ లాడ్జిలోఉంటున్న గుమాస్తాలు రమణరావు, సత్యమూర్తిగార్లు సుశీల, మోహన్ కూర్చుని పేకాడుతూండడం కూడకద్దు. లోకం యేమనుకున్నా సుశీల లక్ష్యంచేసే మనిషి కాదు. మాటల చమత్కారికూడా. ఇవన్నీ సుశీలలో క్రొత్తగా కనబడ్డాయి పట్నవాసానికి క్రొత్తగావచ్చిన మోహన్‌కి. అందుచేతే అతనామెను యేదోలా భావించాడు.

మామూలుగా నలుగురూ కూర్చుని అడ్డాట ఆడుతున్నారు. పేకాట ఆడు తున్నంతసేపూ మోహన్ దృష్టి సుశీల మీదే కేంద్రీభూతమైయుంది. ఈ విష యాన్ని సుశీలకూడ గమనించింది. కాని నిశ్చలంగానేయుంది. ఆట ముగించిలేచారు. సుశీల బిందెతీసికొని నీళ్ల కొచ్చింది. మోహాను గదిప్రక్కనే వుంది కొళాయి. నీళుతో బిందె నెమ్మదిగా నిండుతోంది. మోహన్ కిటికీలోంచి ఆశాదృక్కులు బరుపుతున్నాడు. ఈ చర్యనంతా 'సుశీల' గమనిస్తూనేవుంది. అతని ఊహా సౌధాలు ఆకాశాన్ని చేరాయి. వాని లక్ష్యం పూర్తయింది. ఆమె వెళ్లిపోయింది. అతనలాగే చూస్తున్నాడు.

సాయంత్రం మామూలుగా హోటలు నుంచి భోంచేసి క్లబ్బుకు పోయి యేమీ తోచక యింటి ముఖం పట్టాడు. మనసులో ఆలోచనలు దొర్లుతున్నాయి. ప్రొద్దుట సుశీలకి వ్రాసిన ప్రేమలేఖకు యీపూట ఫలితం కనబడాలి. ఏంచేస్తుందో? ఏం చేస్తుం దేమిటి — అంగీకరిస్తుంది. అంగీక రించకపోతే నావైపెందుకలా చూస్తుంది! ఈ ఊహాలతోనే యిల్లు చేరాడు ప్రొద్దుట పత్రిక తిరగేస్తున్నాడు.

ప్రబంధాలో విరహమంతా అనుభవిస్తు న్నాడు. గుమ్మంలోకొచ్చి తొంగి చూస్తున్నాడు. ఎవరేనా అనుమానిస్తారే మోనని-లోపలకి పోతున్నాడు. ఇంతట్లోకి "సుశీల" బిందెతో కొళాయి దగ్గర కొచ్చింది.

"సుశీలా," అన్నాడాత్రంతో

సమాధానం లేదు.

మళ్లీ పిల్చాడు.

"ఏం" అని గుమ్మములోకొచ్చింది.

"రా లోపలికి" అన్నాడు.

"ఎందుకు"

"ఎందుకేమిటి" అంటూ చెయ్యిపట్టుకు లాగబోయాడు,

"అన్నయ్యగారూ! నిన్నట్నుంచి మీలోని ఈ ప్రవర్తన చూస్తున్నాను. ఇంత చదువు యిందుకేనా-సంసార స్త్రీల చెరచడానికా! చనువుగా మట్లాడితే యిలా భావిస్తారా?"

"సుశీలా! క్షమించు......"

నోటమాటలేదు. నిశ్చేష్టుడై పోయాడు.

"అన్నయ్యా! నన్ను 'చెల్లి'గా ప్రేమించలేవూ!" అంది.

"సుశీలా —— చెల్లాయ్ —— క్షమించు," అంటూ నిలబడిపోయాడు.

# జగమెరుగని త్యాగి

శ్రీమతి వేదుల మీనాక్షీదేవి

★

అస్తమిస్తున్న సూర్యుడు ఆకాశంనుంచి చేతులు చాచి సముద్రాన్నేదో యాచిస్తున్నట్లుగా కనబడ్డాడు. ఏమీ వినిపించుకోని హోరుతో తన వెనకవున్న సూర్యుణ్ణి గమనించకుండా బీచివొడ్డున కూర్చున్న జనంవైపు కెరటాల్ని చాపుతున్నాడు సముద్రుడు.

ఆఫీసునుండివస్తూ మెరీనా హోటల్లో టీ త్రాగి, బీచివొడ్డున యిసుకలో కూర్చున్నారు రావు, వర్మ. వాళ్ల పక్కనే ఆ నాడు హెడ్‌గుమస్తాకూడావచ్చి కూర్చున్నాడు. ఇంతట్లో "చూడు రామనాథం! ఓ బేడ ఇయ్యి నాయనా" అంటూ రంగయ్యతాత వచ్చాడు. రామనాథం "కి"మ్మనకుండా జేబులోంచి బేడతీసి చేతిలో పెట్టాడు.

హెడ్‌గుమస్తా రామనాథం మహాఘటికుడు. కనికరం అన్నది యేకోశానలేదు. గుమాస్తాలచేత చచ్చే పని చేయిస్తూంటాడు ఒక్క పావుగంట విశ్రాంతిగా వుండడం కిట్టదు. దానగుణంకూడా తక్కువే. కాకికి యెంగిలిచెయ్యి విదపడు అని ప్రతీతి. అలాంటి రామనాథం మాట్లాడకుండా బేడతీసి యివ్వడం చూస్తే రావుకీ, వర్మకీ చిత్రంగావుంది. "రామనాథంగారూ! ఆ వచ్చిన ఆయన పేరేమిటి?" రావు సంగతి కనుక్కుందామన్న ఆలోచనతో అన్నాడు. "పేరు రంగయ్య. అంతా రంగయ్య తాత అంటారు. మా వూళ్ళో పిల్లా పెద్దా అంతా అదే పిలుపు. అదివిని మమ్మల్నెరిగున్న వాళ్ళు కూడా ఆ విధంగానే పిలుస్తారు" అని రామనాథం అంటూండగా మధ్యలో వర్మ "ఏమండీ! ఆయన వెళ్ళిపోతుంటే మీ కళ్లలో నీళ్లు తిరిగాయేం?" అన్నాడు.

"ఇల్లాగ అతను వచ్చినప్పుడల్లా రంగయ్య తాత బ్రతుకాఖరికిల్లా అయిందికదా అని దుఃఖమొస్తుంది" రామనాథం అన్నాడు విన్నబోయిన ముఖంతో. "ఏం? మొదటనుండి యీ యాచనావృత్తిలేదా?" అడిగాడు రావు.

"ఈ మధ్యనే ఆరునెలలనుండి ప్రారంభించాడు. ఆస్తిపోయింది ఆఖరికాలానికి" నిట్టూర్చాడు రామనాథం.

"పేకాటాగట్రా ఆడి తగలేసి వుంటాడు" రావు కాళ్లు ఆడిస్తూ అన్నాడు.

"అదైతే అంత అనుకోనక్కర్లేదతన్ని గురించి. కాని, ఇతనలాంటిదేమీ చెయ్యలేదు. ఇతని డబ్బు సద్వినియోగమే జరిగింది" రామనాథం అన్నాడు.

"అయితే మీకీయనెక్కడ యెరుగుదురు? నేనెప్పుడూ యీ వూళ్ళో యీయన్ని చూడలేదు." వర్మ అడిగాడు.

"రంగయ్య తాతదీ నాదీ ఒకవూరే. నేనేకాదు నా వయస్సులోవున్న మా వూరి వాళ్ళంతా ఆయన వద్దికలో పెరిగినవాళ్ళమే. మాకు మంచి మంచి విషయాలు చెప్పేవాడు. కష్టపడి పనిచేయాలనీ, సోమరిగా వుండకూడదనీ బోధిస్తూండేవాడు. ఆయన ఇంకా యింకా యెన్నో నీతులు నేర్పాడు. అవన్నీ మా జీవితాల్ని తీర్చిదిద్దాయి. ఈ వూళ్ళో వాళ్ళ మేనమామలుండేవారు. చిన్నతనంలో ఆయన తరుచు వస్తూండేవాడు. ఇప్పుడు వాళ్ళు లేకపోయినా యీ వూరంటే ఆయనకు అభిమానం. అందుచేత ఎప్పుడైనావచ్చి ఒక రోజో రెండు రోజులో వుండి వెడుతూంటాడు" అన్నాడు రామనాథం.

"అయితే యీయన మీకు బంధువా?" వర్మ అడిగాడు.

"బంధువుకాదు కాని అంతకన్న యెక్కువే. మా వూరివారంతా రంగయ్యతాతనొక దేవతామూర్తిలాగ చూచుకుంటారు."

"అంతటి మహాత్మ్యంవుందేమిటి?" రావు అడిగాడు. వర్మ మరికొంచెం దగ్గిరగా జరిగాడు రామనాథానికి.

"మా రంగయ్యతాతను గురించి చెప్పడానికి యెంతైనావుంది. రంగయ్యతాతకి మహాత్మ్యంలేదు, మంత్రంలేదు. కాని అతనొక దేశసేవకుడు. దేశప్రజలంతా చెప్పుకునే దేశసేవకులలో యీ పేరు మీరు వినివుండకపోవడంవల్ల మీరు నమ్మకపోవచ్చు. నవ్వవచ్చు. కారణం? — అతను యెన్నడూ జైలుకి వెళ్ళలేదు. సత్యాగ్రహాలు చెయ్యలేదు. ఆఖరికి కాంగ్రెసులో పావలా మెంబరుకూడా కాడు. అలాగని అతను దేశభక్తుడు కాడనగలమా? అతని సంగతి తెలిసినవారు, అతన్నెరిగివున్నవారు అంగీకరిస్తారు.

బాగా వెండిలాంటి గడ్డంతో, శిరోజాలతో, ముసలి ముద్దగా యిప్పుడు కనబడుతున్నాడు కనుక మీకు రంగయ్యతాత అన్నా విడ్డూరంగా లేదుకదూ? కాని యీ పిలుపు అతని నలభైయవయేటే వచ్చింది. పిల్లలు "తాతా" అంటే పెద్దలుకూడా అదే పిలుపు ప్రారంభించారు. అదే అందరికీ అలవాటయింది.

ఆజానుబాహువైన విగ్రహం. పదహారువన్నె బంగారం ఛాయ. విశాలమైన ఫాలభాగానికి మధ్యగా సన్నని నిలువుబొట్టు యెర్రగా వుండేది. ప్రసన్న వదనము. ఆయన్నిచూస్తే సాక్షాత్తూ ఆ శ్రీరామచంద్రమూర్తిని చూసినట్లు మనస్సుకి తృప్తికలిగేది చూసినవాళ్లకి. ఆ నాటి రంగయ్యతాత విగ్రహం కళ్ళకు కట్టినట్లు కనబడుతుంది యిప్పుడుకూడ.

మనస్సు మెత్తన. మాటమెత్తన. ఆబాలగోపాలాన్ని తన ఆప్యాయమైన మాటలతో తనవాళ్ళని చేసుకుంటాడు. అతనిలో వొక మహత్తరమైన శక్తివుంది. మా ఊరివాళ్ళకి రంగయ్యతాత అంటే చెప్పలేని అభిమానం" అంటూ రామనాథం రంగయ్యతాత చరిత్ర చెప్పడానికి ఉపోద్ఘాతం ప్రారంభించాడు.

"ఈయన కుటుంబం యెక్కడవుంది?" అడిగాడు రావు.

"రంగయ్యతాతకి ముప్పయ్యవయేట భార్య కాలంచేసింది. సంతానంలేదు. ఆయనకామాటే లేదు. ప్రజలే ఆయన సంతానం, ప్రపంచమంతా ఒక కుటుంబంగా యెంచుకుంటాడు" అన్నాడు రామనాథం.

"అయితే రామనాథంగారూ! కుటుంబం లేకపోయినా ఆస్తియెలా క్షీణించిందండీ" అన్న వర్మ మాటలకు సమాధానంగా రామనాథం "ఆయనకి వసుధే కుటుంబం అన్నాను కదటోయ్. ప్రజలకే తనసొమ్ము వినియోగించాడు. తిండిలేనివాళ్ళకి తిండిపెట్టాడు. బట్టలేదన్నవాడికి బట్ట యిచ్చాడు. చదువుకోలేనివాడికి జీతం కట్టాడు. నూతులులేని చోట్ల నూతులు తవ్వించాడు. రాట్నాలు తెప్పించి అందరిచేత నూలు తీయించేవాడు. తనకున్న ఆఖరు పైసకూడా ఖర్చైపోయినా ఆయనకు విచారంలేకపోయింది. తన సొమ్ము సద్వినియోగం అయిందని అతనికి తృప్తి.

మన జీవితమంతా ఆదర్శంగా, మానవాభ్యుదయానికి తద్వారా దేశాభ్యుదయానికి తోడుపడేటట్లుండాలని రంగయ్యతాత పదేపదే చెబుతూంటాడు. చెప్పడమేకాదు. ఆ ప్రకారం చేసేవాడు.

మాటలు చెప్పడం సులువే. ఆచరణ సాధ్యం కాదు. అందుకే రంగయ్యతాత అంటే ఆ వూరివారికేకాదు—అచుట్టుపట్ల గ్రామాల వారందరికీకూడా యెంతో గౌరవం; భక్తీను. అంతా ఆయనలాగే వుందామని ఆయన్ననుకరించేవాళ్ళం. కుల, మత, వర్గభేదాలులేవా ప్రాంతాల్లో.

"చిన్నప్పటినుండి రంగయ్యతాతకు కాంగ్రెసుసంస్థ అన్నా, కాంగ్రెసు నాయకులన్నా అభిమానంగా

వుండి క్రమంగా ఆ మనలో జీర్ణించిపోయింది. తన గదిలో స్వర్గీయనాయకుల ఫోటోలు గోడలపై అలంకరించాడు. ఆ పటాలకు రోజూ రకరకాల పూలమాలలు వేసి వారి వర్ధంతులు జరిపేవాడు. ఇవన్నీ మామూలు విషయాలు. మా రంగయ్యతాత చేసిన గొప్ప పనులెన్నో వున్నాయి" అన్నాడు.

"మీ రంగయ్యతాతగారంటే మాకూ అభిమానం కలుగుతోంది. ఆ గొప్ప పనులు విందామనివుంది చెప్పండి" అన్నాడు రావు.

"అన్నీ చెప్పడం ప్రారంభిస్తే యేళ్ళు పట్టవచ్చు. కొన్ని మాత్రం చెబుతాను. రంగయ్యతాత యింటికి రెండు యిళ్ళకి అవతలవున్న శేషగిరిరావుగారి మూడేళ్ళ అబ్బాయికి మశూచి వచ్చింది. అంటు వ్యాధి అవడంవల్ల యెవ్వరూ తొంగిచూసేవారు కారు. ఒక వంక బిడ్డకు భయంకరవ్యాధి, వేరొక వంక నిస్సహాయతవల్ల ఆ దంపతులు బెంగటిల్లి పోయారు. రంగయ్యతాతకా సంగతి తెలిసింది. పరుగున వాళ్ళింటికి వెళ్ళాడు. "ఏమిటితల్లీ ఎలా వున్నాడు అబ్బాయి" అంటూ పలకరించేసరికి వాళ్ళ ప్రాణాలు కుదుటబడ్డాయి. రెండు రోజులకా బిడ్డ చనిపోయాడు. ఇరుగు పొరుగువారు ఆ వ్యాధికి వెరచి కిటికీల దగ్గరనుండి చేసుకుని లోపల కూర్చున్నారు. శోకిస్తున్న ఆ దంపతులవద్ద యెవ్వరూ లేరు రంగయ్యతాత తప్ప. ఆ దంపతులు చిన్నవాళ్లు. కాగా అట్టి సమయాల్లో యెవరైనా పూనుకోవాలి గాని స్వయంగా అసలు వారేమీ చేయలేరు కదా? రంగయ్యతాత వాళ్లకి పెద్ద దిక్కుగావుండి యెంతో సహాయకారిగా వున్నాడు. "ఎందుకు వెడతావు? చూస్తూ చూస్తూ అగ్ని గుండంలో దూకుతారా?" అని వూళ్ళోవాళ్లడిగితే "మరేం ఫరవాలేదు. యోగం వుంటేగాని యేదీ రాదు. ఇవ్వాళ వాళ్లకి వచ్చింది అవసరం; రేపు నాకు రావచ్చు. ఏమి చెప్పగలం యేనాటికేమివస్తుందో? అలాంటి చోట్లకు వెళ్లకూడదనడంకన్న ఆ వ్యాధిరాకుండా మన యిళ్ళు వాకిళ్లు శుభ్రంగా వుంచుకుని, అనారోగ్యమైన వస్తువులు తినకుండా ఆరోగ్యం కాపాడుకోవాలి" అని జవాబిచ్చేవాడు. ఈ సంగతి జరిగి సుమారు యిరవై సంవత్సరాలయింది. ఆ దంపతులెక్కడో దూరాన వున్నారు. అయినా రంగయ్యతాతను మరచిపోలేదిప్పటికీ. వారు ఇప్పటికీ వుత్తరాలు వ్రాస్తూనే వుంటారు" రామనాథం చెప్పడం ఆపాడు.

"ఎంత ఆరోగ్యం బాగా చూసుకున్నా అలాంటి భయంకర వ్యాధుల దగ్గరకు వెళ్లలేము బాబూ! అసలు ఆ జబ్బువచ్చినవారిని చూడలేముకూడా" అన్నాడు రావు.

"ఒకమారేమైందనుకున్నారు రావుగారూ! మా వీధిలో ఒక చిన్నపిల్లకు వంట్లో బాగాలేదని వాళ్ల నాన్న నన్ను తీసుకొని వెళ్ళాడు. ఏ జ్వరమో తలనొప్పో అనుకున్నాను. తీరా వెళ్లి చూద్దునుకదా అమ్మవారు సంబంధం. ఇంటికి వచ్చాక జ్వరంవచ్చి ఆరులంఖణాలు చేశాను. మా నాన్న, అమ్మ హడలిపోయారు. దిక్కుమాలిన రోగం పగవాళ్ళకైనా వద్దు బాబూ" అంటూ బాధగా అన్నాడు వర్మ.

"ప్రజలకోసం తన ప్రాణాలనైనా అర్పించడానికి ఎప్పుడూ సిద్ధంగా వుంటాడు. ఎలాంటి రోగులకైనా సేవచేస్తాడు. ఈయనకు శత్రువులూ, మిత్రులూ సమానమే" అన్నాడు రామనాథం.

రామనాథం మాటలకి అడ్డువచ్చి "అంతా సమానమే అంటే అంతా శత్రువులా? మిత్రులా?" అన్నాడు రావు.

రామనాథం నవ్వుతూ "అంతా మిత్రులేనోయ్. ఒకమారు జరిగిన సంగతి చెబుతాను. అదివింటే నీకే తెలుస్తుంది అతని తత్త్వం" అంటూ చెప్పడం ప్రారంభించాడు. "అది 1942-వ సంవత్సరం. భారతమాత పరదాస్యంలోనేవుంది యింకా. ఆ తల్లికి విముక్తి కలిగించడానికి ప్రజోద్యమం తీవ్రరూపం దాల్చింది. భారతీయులు "క్విట్ ఇండియా"నినాదాలు చేస్తూ తమ దేశంతో అవతల దేశాలకు సంబంధంలేకుండా చేయడానికై రైలుపట్టాలు పీకేస్తున్నారు. టెలి

గ్రాఫ్, టెలిఫోన్ తీగలు తెంపుతున్నారు. రైలు స్టేషన్లు తగలబెడుతున్నారు. ఆఫీసు రికార్డులను నాశనం చేస్తున్నారు. బ్రిటిష్‌వారు దేశనాయకులను బంధించి యెక్కడ వున్నదీ తెలియనీయడంలేదు. ప్రజల్ని క్రూరంగా శిక్షిస్తున్నారు. తుపాకులతో భారతీయుల్ని కాల్చి చంపుతున్నారు.

సాయంత్రం అయిదు గంటలవేళ రంగయ్యతాత మా వూరికి మైలున్నర దూరానవున్న రైలుపట్టాల వైపు షికారుగా వెళ్ళాడు. ఆ సమయానికి పది పదిహేనుగురు చిన్నపిల్లలు అంతా పదిపన్నెండేళ్ల వాళ్లు పట్టాల దగ్గిర నిలబడివున్నారు. వారికి దగ్గర లాంటి ఒక దొర తుపాకీ చేత్తో పట్టుకొని వున్నాడు. పిల్లలు పట్టాలు పీకడానికి ప్రయత్నించుతుంటే ఆ దొర కొడతానని బెదిరించాడు. అందరూ వెనక్కి తగ్గారు ఒక్క రాజా తప్ప. రాజాకి తుపాకీ చూపించి దొర పేల్చేస్తానని బెదిరిస్తున్నాడు. "ఎలా పేలుస్తావో పేల్చు" అంటూ చొక్కా గుండీలుతీసి గుండె చూపిస్తూ మీది మీదికి వెడుతున్నాడు ఆవేశంతో. "కానుకో" అంటూ తుపాకీ యెత్తిబోతున్నాడు దొర. అది దూరాన్నుండి చూస్తున్న రంగయ్యతాత ఒక్క అంగలో వారిద్దరి మధ్యకి వెళ్ళాడు.

రాజా ఆ వూళ్లో గొప్ప వర్తకుడైన సుబ్బయ్య షావుకారు ఏకైక పుత్రుడు. సుబ్బయ్యకు రంగయ్యతాత అంటే కోపం. న్యాయం, ధర్మం అంటూ అందరికి బోధిస్తూంటాడనీ, అట్టే లాభాలు తీసుకుని ప్రజల్ని పీడించడం వారి రక్తం తాగడమేనని తన కెన్నిమార్లో చెప్పాడు. చెప్పడమేకాదు బలవంత పెట్టాడనీ సుబ్బయ్యకు కోపం. సుబ్బయ్య బ్లాక్ మార్కెట్టు ప్రారంభించినట్లు రంగయ్యతాతకి తెలును. ఎప్పటికైనా తన గుట్టు బట్టబయలు చేస్తాడేమో. ఊరంతా రంగయ్యతాత పక్షం అవడంవల్ల అతడెల్లా చెబితే అలా చేస్తారు. ఎవ్వరూ తన దగ్గర వస్తువులు కొనకుండావుండే ఒకానొక రోజు తప్పక రాగలదు. అప్పుడు తన దుకాణంయేంగాను? ఇలాంటి భావాలతో సుబ్బయ్య రంగయ్యతాతపై కచ్చకట్టి మాట్లాడ్డం మానేశాడు. ఈ సంగతి రంగయ్యతాతకు తెలియకపోలేదు. "పిరికివాడు" అనుకుని నవ్వుకున్నాడు.

రాజా గుండెకి గురిపెట్టిన దొర తుపాకికి తన గుండె యెదురుగాపెట్టి "చూడు - నోరెరుగని పసివారికమీద నా ప్రతాపం? ఒక చెంపకొడితే పాలు, మరొకచెంపకొడితే నీరుకారే యీ చిన్నబిడ్డని కొట్టడానికి తయారవుతున్న నువ్వు యెంత దుర్మార్గుడివో, నీ అంతరాత్మ యెంత క్రూరమైందో తెలుస్తోంది. ఇలాంటి బిడ్డలు నీకు లేరూ? నాది బ్రిటన్. నేను బ్రిటిష్‌వాణ్ణి అని నువ్వు సగర్వంగా చెప్పుకుంటున్నావే! అలాగే మాది భారతదేశం. మేము భారతీయులం అనుకుంటే యేంతప్పు? నీ సేవకా ధర్మం నువ్వు చేస్తున్నాననుకుంటున్నావు, నీ ప్రభువు బ్రిటిష్ ప్రభువు అనుకుంటున్నావుకదూ? అదిప్పటికీకాదు. ఇంతమంది ప్రభువులులేరు నీకు, నాకు, యీ చిన్న బిడ్డలకి మాత్రమేకాదు; ప్రపంచంలోని జీవులన్నింటికి ఒకే ప్రభువు ఆపైని వున్నాడు. మనం చేసే పాప పుణ్యాలను చూస్తూనే వుంటాడు. నీకు తగిన శిక్ష చేస్తాడు. ఊరివారి బిడ్డను రాజుగారిబిడ్డ దండిస్తే రాజుగారి బిడ్డను దేముడు దండించుతాడు. ఈ నాడు యీ పసికూనను నువ్వు చంపితే రేపు నీ బిడ్డను భగవంతుడు తీసుకుపోతాడు. అది తెలుసుకో. నీ తుపాకీ వూరికే వుండనక్కర్లేదు. ఈ బిడ్డకు బదులు నన్ను చంపు. సంతోషంగా మృత్యువు నెదుర్కుంటాను" అంటూ ప్రశాంతంగా నిలబడ్డాడు రంగయ్యతాత.

అప్పటికి వూళ్లో జనం చాలామంది చేరారు. వారందరికీ ముందుగా సుబ్బయ్య షావుకారు నిలబడివున్నాడు. అందరినీ చురచుర చూసి చక్కాపోయాడు దొర. రంగయ్యతాతమీద పూర్వపు శత్రుత్వం యింకా సాధించాలో, తనకు పుత్రభిక్ష పెట్టినందుకు కృతజ్ఞతగా వుండాలో నిర్ధారణచెయ్యలేకపోతున్నాడు సుబ్బయ్య. రాజాని గుండెలకి హత్తుకొని రంగయ్యతాతకేసి వెర్రివాడిలాగ చూస్తూ వుండిపోయాడు."

"తన కన్న కొడుకు ప్రాణాలకు ప్రాణం అడ్డు వెయ్యడానికి సిద్ధపడిన రంగయ్యతాత విషయంలో ఏమీనిర్ధారణ చెయ్యలేకపోవడమే! నిజంగా ఆ సెట్టి నరపశువుకాకపోతే వెంటనే ఆ మహానుభావుని కాళ్లమీదపడరూ?" అన్నాడు రావు.

రావు ముఖం యెర్రబడిపోయింది కోపంతో. "ఆ విశ్వాస ఘాతకుడు కనబడితే యీ పిడికిలితో ఒక్కపోటు పొడుద్దును" అంటూ పిడికిలిబిగిస్తూ అన్నాడు వర్మ.

"ఇది యీ నాటి మాటకాదు. పన్నెండేళ్ల నాటి మాట. ఆ షావుకారు కాళ్ళమీద పడలేదుగాని పెర్రివాడిలాగచూస్తూ కళ్ళనీళ్లు కార్చాడు. ఆ సమయంలో మాలాగే అక్కడజేరినవాళ్ళకే కోపం వచ్చిందికాని సుబ్బయ్య కన్నీళ్లు చూశాక వెనక్కి తగ్గారు.

ఆ ప్రాంతాలలోనే మన ఆఫీసుకి వచ్చాడు రంగయ్యతాత. వచ్చి "రామనాథం, మనదేశం స్వతంత్రం పొందాలి. నువ్వు పరప్రభుత్వానికి దాసోహ మనక్కరలేదు. ఆ రికార్డులు యిలా పారెయ్యి. నువ్విప్వకపోతే ఆఫీసుకి నిప్పుపెట్టే ట్లున్నారు ప్రజలు" అన్నాడు. ఏంచెయ్యడానికి తోచక నేను చూస్తూంటే రికార్డులు పట్టుకొని చల్లగా చక్కా బోయాడు. ఏపనిచేసినా యెవరి కళ్ళాపడకుండచేయడమేగాని పదిమందిలో అల్లరి పొగడ్త కెట్టడు. మహాత్ముని బోధలను ఆ శ్రీకృష్ణ భగవానుని వచనాలుగా స్వీకరించేవాడు. అవే ఆయన పారాయణ చేసుకొనేవాడు. వాటిని ఆచరణలో పెట్టేవాడు.

ఓ నాడు రంగయ్యతాత వెక్కి వెక్కి యేడుస్తూం డడం కొందరు పిల్లలు చూశారు. ఆ సంగతి క్షణంలో వూరంతా తెలిసింది. అంతా వచ్చారు. నవ్వుతూ కలకలలాడుతూ యెప్పుడూవుండేతాతి ముఖాన్ని విన్నదనంచూడలేకపోయారు. "ఏంతాతా అలా దుఃఖిస్తున్నావ్?" అని అడిగారు. "నాయనా, మహాత్ముడు చంపబడ్డాడు" అని మరీ దుఃఖించసాగాడు.

మహాత్ముని నిర్యాణవార్త ఆ సేతుహిమాలయం వరకేకాదు తృటిలో దేశదేశాలు తెలిసింది. అందరిలాగ ఆ వూరిజనం "అయ్యో మహాత్ముడుపోయాడే" అని బాధపడ్డారు. కాని, రంగయ్యతాత దుఃఖపడ్డం చూడలేకపోతున్నారు.

"తాతా, నువ్వు సుఖదుఃఖాలకు అతీతుడవు. అన్నీ సమానమే నీకు. అందరూ సమానమే. నీ భార్యపోయినప్పుడు నీ చిత్తస్థైర్యం మేము తెలుసుకున్నాం. ప్రవాహ వేగంలో ఒక కెరటంవచ్చి రెండు కర్రల నొకచోట చేర్చింది. మరొక కెరటం వచ్చి వేరుచేసింది. కాలప్రవాహాని కెవరు యెదురీదగలరని చెప్పిన నీ వంటి యోగికి దుఃఖమేమిటి?" అన్నారు అతిదీనంగా.

"నాయనా, నేను చెప్పింది స్వవిషయంలో మాట. బాపూజీ లోకబాంధవుడు. భగవంతునిచే శాంతి సాధనకై పంపబడిన దూత. మహా పురుషుల లక్షణా లుండడంవల్ల మహాత్ముడయ్యాడు. మన బాపూ మనకిలేడు. అయ్యో ఎంతటి దారుణమైనమాట వినవలసివచ్చింది. శత్రువునైనా కఠినంగా మాట్లాడవద్దనేవాడు. కొట్టినవారిని కొట్టవద్దు. తిట్టినవారిని తిట్టవద్దు. అన్నీపడి వూరుకుంటే వారికే వస్తుంది పశ్చాత్తాపం. అదే వారికి ఆయుధంలాగ పనిచేస్తుందనిచెప్పే అహింసామూర్తి హింసించబడి మరణించాడు. భారతమాత పుత్రరత్నాన్ని గోల్పోయింది. భారతనాయకమణి అదృశ్యమైంది. ధృవతార రాలిపోయినట్లుంది. ప్రపంచమంతా అంధకార బంధురమైపోయింది. ఈ దుఃఖంయెలా భరించడం?" అంటూ వాపోయాడు. వారం రోజులు అన్నం, నీరు ముట్టలేదు." రామనాథం కంఠం రుద్ధమైంది.

మహాత్ముని మరణవార్త సందర్భంరాగానే వర్మ మనస్సు అదోకలాగ అయిపోయింది. "ఆయన మరణానికి దేశదేశాలు దుఃఖించాయి. ఇక భారతీయులమాట చెప్పాలా? జాతిపిత, యుగపురుషుడు

అయిన మహాత్ముని గోల్పోయినప్పుడు ప్రతి భారతీయుని హృదయంలోను అగ్ని పర్వతపు భుగభుగలే, అబ్బా! ఆ నాడు రోజల్లా సైరన్ కూతలు రోదన ధ్వనిలాగ కూస్తుంటే ఆ బాల గోపాలానికీ గుండె తరుక్కుపోయింది" అంటూ నిట్టూర్పు విడిచాడు.

"ఆ సమయంలో మన దేశ నాయకులు చాలా నిగ్రహంతో తెలివిగా వ్యవహరించారు. మతోద్రేకాలు పెచ్చుపెరగకుండా వుండేందుకు "ఒక పిచ్చివాడు చంపాడు" అన్నారు. అంతేకాని ఎవరు చంపినదీ తెలియనీయలేదు" అన్నాడు రావు.

"అన్ని వేగాలకంటె మనోవేగం గొప్పది అంటారిందుకే. రంగయ్యతాత గురించి చెబుతుంటే దాని మీద యెన్ని కబుర్లు వచ్చాయో చూశారా! జాతీయగీతంయొక్క ప్రాముఖ్యత యేమిటో, పౌరశిక్షణ అంటే యేమిటో ఆ వూరి జనానికేకాదు ఆ చుట్టుపట్ల వాళ్ళకికూడా నేర్పింది రంగయ్యతాతే! ఆ శిక్షణే ఒకప్పుడు వాళ్ళ ప్రాణాలు కాపాడింది" అన్నాడు రామనాథం.

"జాతీయగీతం ప్రాణాలెలా కాపాడింది. చిత్రంగా వుంది మీమాట" రావు, వర్మ ఒక్కమారే అడిగారు.

"చిత్రంగానే వుంటుంది. ఇలాంటి సంఘటన యెక్కడా జరిగినట్లు వినలేదుకూడాను.

ఆంధ్రరాష్ట్రం అవతరించుతున్న శుభదినం. రంగయ్యతాత సలహాపై ఊరంతా అలంకరించారు. ప్రతీయింటిమీద జండా యెగురవేశారు. ఆకాశ వీధిలో ఆ జండా లెగురుతుంటే నేత్రోత్సవంగావుంది. శ్రీరాములుగారి ఆత్మార్పణంతో వచ్చింది రాష్ట్రమని, ఆ నాడు రంగయ్యతాత వుపవాసం వున్నాడు. పిల్లలంతా ఆంధ్రరాష్ట్రం బాడ్జిలు ధరించి వుత్సాహంగా తిరుగుతున్నారు. సాయంత్రం నావ షికారుకు తీసుకొని వెళ్ళమని రంగయ్యతాత నడిగారు. మొదట అంగీకరించకపోయినా వారి వుత్సాహంచూసి అంగీకరించకుండా వుండలేకపోయాడు చివరకి. మూడు నావలపై బయలుదేరారు. త్రోవలోకి తెచ్చుకున్న ఫలహారాలు తిన్నారు. తియ్యని గోదావరి నీరు తాగారు, హాయిగా రెండు గంటలు తిరిగారు. పౌర్ణమిముందు అవడంవల్ల వెన్నెలకూడా వచ్చింది. మహా ఆనందంగావుంది. ఎవరికి వచ్చిన పాటలు వారు పాడారు. కబుర్లు చెప్పుకున్నారు. ఇక రెండు ఫర్లాంగుల దూరంలోవున్నారు గట్టుచేరడానికి.

గాలి ప్రారంభమైంది. ఉన్నట్టుండి నావ వూగడం ప్రారంభించింది. గోదావరిలో అలలు బయలుదేరాయి. గాలి యెక్కువైంది. మూడు పడవలలోవున్న పిల్లలూ ఒక్కమారు లేచి నిలబడ్డారు ఖంగారుపడుతూ. ఆ ఖంగారులో ఒక్కచోటికి చేరబోతున్నారు. అలాచేరితే పడవ తెలికిలబడే ప్రమాదంవుంది. ఆ సంగతి పాపం ఆ చిన్నవాళ్ళకి తెలియదు. భయపడిపోతున్నారు. "జనగణమన అధినాయక జయహే" జాతీయగీతం వినబడింది. ఎక్కడివాళ్ళక్కడ నిలబడ్డారు పరిగెట్టడంమాని. కళ్లు మూసుకొని, తలవంచుకుని నిలబడ్డారు పాట పూర్తి అయ్యేవరకు. రంగయ్యతాత పాడాడు పాట! ఏపనిలోవున్నా సరే జాతీయగీతం వినబడగానే ఆ పనివదిలేసి శాంతంగా నిలబడమని రంగయ్యతాత బోధించాడు. ఆ ప్రమాదకరమైన పరిస్థితిలో జాతీయ గీతంపాడి వాళ్ళంతా ఒక్కచోటికి రాకుండా చేశాడు. అంతలో పడవలు గట్టుజేరాయి. ప్రమాదం తప్పించినందుకు జోహారు లర్పించారు రంగయ్య తాతకి" అన్నాడు రామనాథం.

"దేశభక్తితోపాటు సమయస్ఫూర్తికూడావుంది మీ రంగయ్యతాతకి. విషయం తెలిసినా సమయానికి జ్ఞాపకంరాదు. గురువుకుతగ్గ శిష్యులే ఆ పిల్లలు కూడా" ఆశ్చర్యంతో అన్నాడు వర్మ.

"రంగయ్యతాతా, నువ్వు దేశభక్తుడివి, త్యాగమూర్తివి. ప్రజాసేవ చేశావు. ప్రభుత్వం నిన్ను గుర్తించలేకపోయింది. నీకేమీ ఉపకారం చెయ్యలేదు అంటే అంటాడు "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి" అన్నారు. ఎవరి మాతృదేశం అంటే వారికి అభిమానం వుండడం గొప్పా?" అని.

తను త్యాగమూర్తికాదట. ఎందరో త్యాగులున్నారుట. ప్రభుత్వం ఉపకారం చెయ్యవలసినంతపని తాను చేయలేదుట. ప్రతీవారు ప్రభుత్వం యేమి చెయ్యలేదనడం ఒకటి బాగా అలవాటయింది. వాళ్లేం దేవతలా? మనవంటివారేకదా? తెల్లవారితే యెన్నెన్నో సమస్యలు యెదుర్కొంటూంటే వాటితో సతమతమౌతుంటారు. అవన్నీ చాలక మనకేవో చెయ్యలేదంటే యెంతమందికని వ్యక్తిగతంగా చెయ్యగలరు? దేశమంటే మట్టికాదు, మనుష్యులే - చేతనైనంతవరకు మానవసేవ చెయ్యడం ప్రతివారి కర్తవ్యం. మానవసేవే మాధవసేవ. అంతా ఆ విధంగావుంటే ప్రజలకీ, ప్రభుత్వాలకేకాక ప్రపంచానికే తీరని సమస్యలుండవు అంటాడు. నిర్మాణ కార్యక్రమం అంటూ యీనాడు పెద్దలు చెప్పే కార్యక్రమాన్ని యేనాటినుండో అమలుపరుస్తున్నాడు. నేను భారతమాత బిడ్డనని సగర్వంగా చెప్పుకుంటాడు. ముఠాతత్వాలకు, పార్టీరాజకీయాలకు అతీతుడు.

మా రంగయ్యతాత ఇంకా యెన్నెన్నో గొప్ప పనులు చేశాడు. కొన్ని మాత్రమే మీకు చెప్పాను. ఎవరు గుర్తించకపోయినా ఆయనకు లోటులేదు. సరిహద్దు గాంధి, రెడ్ షర్టు దళ నాయకుడు అయిన ఖాన్ అబ్దుల్ గఫర్ ఖాన్ వలె యెప్పుడూ మానవాభ్యుదయానికి తోడ్పడడమే రంగయ్యతాత ఆశయం. అదే ఆయన జీవిత పరమావధి. ఇంకా ఇలాంటి అజ్ఞాతసేవకు లెందరున్నారో!" రామనాథం అన్నాడు.

"ఏ పదవులను అపేక్షించక నిరంతరం ప్రజల మధ్యనుండి, వారిలో తానొకడై, వారి కష్టసుఖాలలో పాలుపంచుకుంటూవుండే రంగయ్యతాతవంటి దేశసేవకులను గుర్తించి తగిన రీతిని సత్కరించాలి" రంగయ్యతాత తనకేదో అప్పుడిలాగ అనిపించి అన్నాడు రావు.

"తన అర్థం, ప్రాణం ప్రజకు వినియోగించాడు. తన సుఖం చూచుకోలేదు యెప్పుడూ. పరోపకారార్థమిదం శరీర"మను తరగతికి చెందినవాడు రంగయ్యతాత. నేడు బీదస్థితివచ్చినా ఆ అడగడంలోనూ ఒక విశిష్టతవుంది. తనకు కావలసినదానికన్న యెక్కువ అడగడు. అదైనా యెరుగున్నవాళ్లైతేనే. ఈ వూళ్లో చాలాకాలంగావున్న రెండు హోటళ్లున్నై. ఎప్పుడైనా అక్కడికే వెడతాడు. వాళ్లు ఈయన్ను చూడగానే భోజనం పెడతారు. ఆయన అడగనే అక్కర్లేదు. మా రంగయ్యతాత యిప్పుడు కూడా దానం చేస్తూనే వుంటాడు.

మా వూళ్లోని యిప్పటి కుర్రాళ్లు కథలుగా చెప్పుకుంటారు ఈయన విషయాలు. రంగయ్యతాత వృద్ధుడైపోయాడు. వెనకటి హుషారులేదు. అందుచేత వారికి యితనితో సంబంధంలేదు. రామాయణకథాగాయకులైన కుశలవులు శ్రీరాముని చూచినప్పుడు రామాయణకథా పురుషుడని భయ, సంభ్రమాశ్చర్యాలతో చూసినట్లు చూస్తారు రంగయ్యతాత యీయనేనని" అంటూ రామనాథం రంగయ్యతాత కథ ముగించాడు.

హోటల్లోని గడియారం యెనిమిది కొట్టడంతో వారు ముగ్గురూ ప్రకృతావస్థను పొందారు.

"గొప్పవ్యక్తి" అని రావు అంటూండగా ముగ్గురూ లేచారు.



# దేవదూతలు





'అరవభూమి వేణు'

శ్రీదేవమ్మ లాంతరు వెలిగించి, వసారా చూరులోంచి వ్రేళ్లాడుతున్న ఇనుపకమ్మీకి తగిలిస్తూండగా, గుమ్మందగ్గిర చప్పుడు విని "ఎవరక్కడ?" అంది కంగారుగా ఆ మసక చీకటిలో గుమ్మంవేపు చూస్తూ.

"నేనే నత్తయ్యా.... మా అబ్బాయి మధ్యాహ్నమనంగా ఆడుకోటానికెళ్లాడు. యింత పొద్దుబోయినా అంతులేదు. మీ పిల్లలుకూడా యింకా రానట్టుంది. బుజ్జాయేడీ! ఏమీ సందడిలేదే?" అంటూ ప్రవేశించింది పొరుగింటి రత్తమ్మ.

"రా, రత్తమ్మా" అంటూ చాప పరచి "కూర్చో, నేనూ వాళ్లకోసమే ఎదురు చూస్తున్నా" అంది శ్రీదేవమ్మ. చాపమీదకూర్చుంటూ ఇంతలో బుజ్జాయ్ పరుగెత్తుకుంటూ వచ్చి సరాసరి శ్రీదేవమ్మ ఒడిలో వ్రాలి, "అమ్మా! అమ్మా! వాళ్లొచ్చాలే. వాలు నాకు పిప్పలమెంటులు ఇచ్చాలు; అన్నయ్యకి కొత్తపుత్తకం కూడ ఇచ్చాలే. అంతా ఊలికినే" అంటూ గుక్క త్రిప్పుకోకుండా చెప్పి పిప్పరమింటు చప్పరిస్తూ అమ్మఒడిలోంచి లేచి చంగున ఒక్కగంతేసి "అన్నాయ్" అంటూ గుమ్మంవేపు పరుగెత్తాడు. శ్రీదేవమ్మ కంతా అయోమయంగా ఉంది. "ఏమిటి రత్తమ్మా ఈహడావుడి?" అని అడిగింది.

'నాకూ ఏం తెలియదత్తయ్యా' అంటూండగానే గోపీ పరుగెత్తుకుంటువచ్చి, "అమ్మా మనూరికి కిరస్తానీవాళ్లొచ్చారు నాకీ పుస్తకం ఊరికినే నాకు నాకే యిచ్చేశారు." అంటూ పుస్తకాన్ని శ్రీదేవమ్మ చేతిలో పెట్టాడు. "మత్తయిసువార్త" అనే పుస్తకం అది. రత్తమ్మ ఆపుస్తకం తీసుకుని తెరచిచూస్తుండగా "నలిగిపోతుందత్తయ్యా. త్వరగా యివ్వు" అంటూ లాక్కున్నాడు గోపీ.

"అమ్మా, వాళ్లు ఎంతమంచి పాటలు పాడారనుకున్నావ్! సినిమా పాటలు కూడా పాడారమ్మా!" అన్నాడు గోపీ "మత్తయిసువార్త"కు అట్టవేసుకుంటూ.

"ఎందరొచ్చార్రా?" అని అడిగింది రత్తమ్మ.

"ముగ్గులొచ్చాలే. ఆలమణి పెట్టెకూడ వాగించాలు" అన్నాడు బుజ్జాయ్.

"ఎక్కడున్నార్రా వాళ్లు?"-శ్రీదేవమ్మ అడిగింది.

"మన చావిటి దగ్గర జువ్వి చెట్టుకిందున్నారు. రేపు పొద్దున్నే ఊళ్లోకొస్తా

రట. మాబడికికూడా వస్తామన్నారు.'' అన్నాడు గోపీ లేగదూడ ఉత్సాహంతో గంతులేస్తూ. గోపీ పుస్తకం మీద పేరు రాసి తన పుస్తకాలతోపాటు నలగకుండా పదిల పరచుకున్నాడు.

"ఆకలేస్తోంది బువ్వపెట్టమ్మా''అని బుజ్జాయి గోల పెట్టగా వాడిపోరు పడలేక శ్రీదేవమ్మ వంటింటిలో కెళ్లింది. "మా వాడు కూడ వచ్చి ఉంటాడు. వస్తా నత్తయ్యా.'' అని చెప్పి వెళ్లిపోయింది రత్తమ్మ. పిల్లల భోజనాలయాక శ్రీదేవమ్మ తెల్లటి వెన్నెట్లో మంచం మీద పరుపుపరచి వాళ్లను పడుకోపెట్టింది. బుజ్జాయికి జోకొడుతూండగా బుజ్జాయి చంద్రుడి వేపు చూస్తూ "అమ్మా వాలె వలే చెప్పవూ?'' అని అడిగాడు రహస్యంగా. "వాళ్లు దేవదూతలు బాబూ, దేవునిదగ్గర్నుంచి వచ్చారు.'' అని చెప్పి ఊరడించింది బుజ్జాయిని. శ్రీదేవమ్మకు 'దేవదూతలు' అనేమాట చిన్నప్పు డెప్పుడో వాళ్ల ఊరికి ఇలాగే కిరస్తానీ వాళ్లొస్తే వాళ్లమ్మ చెప్పింది. ఆ మాట తనకు ఈ నాటికీ గుర్తుంది. నిజంగా వాళ్లు ఊళ్లోకి వచ్చారంటే ఆమెకు అద్భుతమైన ఆహ్లాదం కలిగించింది. తన చిన్ననాటి రోజుల్ని నెమరు వేసుకుంటూ కూర్చొనుండగా భర్తరామయ్య పిలుపు విని వంటింటివేపు పరుగెత్తింది ఆయనకు భోజనం పెట్టటానికి. బుజ్జాయి, గోపీ, ఆ కిరస్తానీ వాళ్ళను తల్చుకుంటూ చల్లటి గాలిలో మత్తుగా పడి నిద్రపోయారు.

♦ ♦ ♦

తెల్లవారింది. చీకటిని చీల్చుకొనుచు ప్రవేశించాయ్, ఉదయ భానుని అరుణ రేఖలు. పిట్టలు కీచుకీచుమని రొదచేస్తూ గూళ్లనుంచి ఎగిరి పోతున్నాయ్ ఆహారసం పాదనార్థం. పంటకాపుల పాలేళ్లు నాగేళ్లు భుజాన పెట్టుకుని ఎడ్లను తోలుకొని ఉత్సాహంతో పొలాలకు పయనమవుతున్నారు. ఆడాళ్లు ఇళ్లముందు "కళ్లాపు" చల్లి ముగ్గులతో అలంకరిస్తున్నారు. ఆడపడుచులు కుండలు చంకన బెట్టుకుని వొయ్యారం వొలకబోసుకొనుచు జట్లుజట్లుగా మంచి నీళ్ల బావిదగ్గర కెళుతున్నారు.

బుజ్జాయ్, గోపీలకి ఇంకా మెలకువ రాలా. శ్రీదేవమ్మ వాళ్లిద్దర్నీ ఒకసారి లేపివచ్చినా, ఆమెనటు పోనిచ్చి మళ్లీ ముసుగుదన్ని పడుకున్నారు. ఇది కాదు ఉపాయంఅనుకొని బుజ్జాయిని తట్టిలేపుతూ "బాబూ కిరస్తానీ వాళ్ళొస్తున్నారు లేవరా.'' అంది. ఆమాట చెవినిపడంగానే బుజ్జాయ్ మాత్రమేకాదు గోపీకూడ అమాంతంగాలేచికూర్చొని, కళ్లు నులుము కొని, ఆవలిస్తూ "ఏరీ!'' అన్నాడు. "మొఖం కడుక్కోండి. వస్తారు.'' అంది శ్రీదేవమ్మ. నిజంగానే ఆసమయానికి

అల్లంత దూరాన ఏదో భజనజరుగుతున్న శబ్దం వినిపించింది. క్రమక్రమంగా ఆశబ్దం ఎక్కువౌతోంది. శ్రీదేవమ్మ బియ్యం చెరుగుతూ, వదిలేసి బావినానుకున్న పిట్ట గోడదగ్గర నిలబడి ప్రక్కనేవున్న బాట వైపు తొంగిచూస్తోంది.

ఒక బట్టతలాయన చిడతలు చేతబట్టుకుని వాయిస్తూ, "ఏసుబోధలను వినరండీ, యేసునాథుని కనరండీ! దీనజనావన భక్తపాలనా యేసునాథుని నామమును ఏకకంఠముతో స్తుతియించండీ!." అని భక్తి రసం పొంగిపోతున్నట్లు పరవసుడై పాడుతున్నాడు. మరిద్దరు తబలా, హార్మనీ, భలేమోతగా వాయిస్తున్నారు. వారి ముగ్గురినీ వెంబడిస్తూ ఓయిరవై ముప్ఫై మంది పిల్లలూ, పెద్దలూ వస్తున్నారు. ఎప్పుడు వెళ్లి కలుసుకున్నారో యేమో ఆ గుంపులో బుజ్జాయ్, గోపీకూడ కనుపించారు శ్రీదేవమ్మకు. "అబ్బ! ఎంత శ్రావ్యంగా పాడుతున్నారు! ఎంత భక్తి!" అని ఆశ్చర్యపోయింది శ్రీదేవమ్మ.

ఇంతలో ఆబట్టతలాయన వీధిలాంతరు ప్రక్కనున్న పెద్ద రాతిబండమీద నిలుచోని ఠీవిగా "మహాజనులారా!" అని సంబోధించాడు. జనం తేనెటీగలవలె అతని చుట్టూమూగారు.

"...మహాజనులారా! మీరందరూ మూర్ఖులై రాతివిగ్రహాలను పూజిస్తూ మీకాలాన్ని వృధాపుచ్చుతున్నారు. విగ్రహారాధనద్వారా మీరు మోక్షాన్ని సాధించలేరు. మోక్షసాధనకు కరుణామయుడైన ఆ భగవంతుని అనుగ్రహంకావాలి. ఆభగవంతుని అనుగ్రహం లభించాలంటే నిర్మలమైన మనస్సుతో నిశ్చలముగా ప్రార్థన చేయాలి. మన ప్రార్థనను ఆలకించువాడు మనతండ్రియైన ఆ యేసునాథుడొక్కడే. ఏసుకు మించిన దైవములేదు. సర్వమతములను సమానముగ చూచి, మాల మాదిగ అనే కులభేదములేక అనుగ్రహించువాడు ఏసు ఒక్కడే. ఏసు బీదలపాలిటి రక్షకుడు. దీనబంధువు. ఆర్తత్రాణపరాయణుడు. కరుణామయుడు. ఆపద్బాంధవుడు. నరకకూపమునుండి విముక్తినివ్వగలవాడు ఏసు . . .

ఏసు నాథుని నీతి బోధనలను తెలియజేయు 'బైబిలు'ను మించిన గ్రంథము ప్రపంచంలో ఏ మతంలోనూ లేదు. మీ రామాయణం మహాభారతం, వేదాలు అవన్నీ తుక్కుగ్రంథాలు. అవన్నీ పిట్టకథలు. వాటిల్లో నిజమునేది ఆవగింజంతైనాలేదు."

"ఏయ్, అలాంటి కూతలు కూశావంటే పళ్ళురాలిరగదంతాం ఏమనుకొన్నావేటి, తుక్కుగిక్కు అన్నావంటే డొక్క చీల్చి డోలుకడ్తాం జాగ్రత" అంటూ దుడ్డుకర్రతో దండధరుడిలా ఆబట్ట తలాయన్ని

హడలగొట్టిస్తూ ముందుకొచ్చాడు కొండీ వెంకన్న.

"శాంతించునాయనా! నేనేమన్నాను? అవికూడ బైబిలువంటి గ్రంథాలే-అయితే వాటన్నిటికీ మూలగ్రంథం బైబిలే" అని ప్లేటు మార్చి, "ఏసునాథుని నిత్యము స్తుతించిన మన పాపములుహరించిపోవును. మీకు నిజంగా మోక్షప్రాప్తి కలగాలంటే పవిత్రమైన క్రీస్తుమతాన్ని స్వీకరించాలి" అని ముగించకముందే-

"ఓస్, యిదిపాత పురాణమేగదా! పదండ్రా పోదాం" అని వెకిలిగానవ్వుకొనుచు వేపపుల్లలు నముల్తూ యిళ్లకు దారి తీశారు పెద్దలందరూ. పిల్లలుమాత్రం పిప్పరమింట్ల కోసం మొగంవాచి కూర్చున్నారు.

ఆబట్టతలాయన పాచిక పారలా. మళ్లీ ఎలుగెత్తి. "మహాజనులారా! ఈ రోజు రాత్రి 10 గంటలకు చావిట్లో హరికథ జరుపబడును. అందరూ రండి" అని అరిచాడు లౌడ్‌స్పీకరులా. అందరూ ఒక్కసారి వెనక్కుతిరిగి చూసి 'హరికథట ఈ రేత్తిరికి' అని భుజాలెగరేసుకొనుచు వెళ్లారు. "బట్టతలాయన ఎంత నిదానస్తుడు! ఎంత కళ ఆయన ముఖంలో! అచ్చం దేవతా స్వరూపంలాగున్నాడు." అని అచ్చెరువోయింది శ్రీదేవమ్మ.

"చావిట్లో హరి కథ" - అన్నమాట ఊరంతా గుమ్మడి తీగలా ప్రాకి పోయింది. పెందలాడే గోపీ, బుజ్జాయ్‌లు అన్నంతిని రత్తమ్మత్త కొడుకు పాపయ్యతోకూడ చావటిదగ్గరకు పరుగెత్తారు హరికథ వినాలని. ప్రొద్దుగూకకముందే ఏనాది మంగ కలుపు గడ్డి తీసుకొచ్చి పడేసి "అమ్మగోరూ! ఇయ్యాల సావిట్లో అరికథ సెపుతారంట-యినాలనివుంది.-బిరాన కూడే యమ్మ - ఎల్లిసూసొస్తా." అని తొందర పెట్టింది. "ఆసీ నీ యిల్లు బంగారంగానూ నువ్వుగూడా హరికధ వినాలటే" అని కసిరి కూడు పెట్టి మంగను సాగనంపింది శ్రీదేవమ్మ.

రామయ్య ఇంటికొచ్చి భోజనాలయాక తమలపాకులు నముల్తూ వెన్నెట్లో పడుకుని కూనిరాగాలు తీస్తున్నాడు. శ్రీదేవమ్మ భోజనం చేస్తోంది. ఇంతలోకే బుజ్జాయ్, గోపీలు శ్రీదేవమ్మ ఇచ్చిన కాసితో చేగోడీలు కొనుక్కు తిని చక్కాయింటికి తిరిగి వచ్చారు.

"ఏరా గోపీ! అప్పుడే హరికథ అయిపోయిందేమిటి?" అన్నాడు రామయ్య నవ్వుతూ.

"హరికథాలేదు. ఏమీలేదు. అంతా అబద్ధాలు నాన్నా, యింకా ఏమీ మొదలెట్టలేదు. బుజ్జాయి అక్కడే నిద్రపోతే లేపితీసుకొచ్చాను." అన్నాడు గోపీ ఆవ

లిస్తూ, తనకు నిద్రమత్తులేనట్టు. అన్నదమ్ములిద్దరూ పరుపుమీద నడుం వాల్చిందే తడవుగా వారికి నిద్రపట్టేసింది.

"ఏంసంగతి? అప్పుడేవచ్చేశారు ?"అని అడిగింది శ్రీదేవమ్మ విస్తరాకు తీసుకుపోయి దిబ్బమీద పడేస్తూ.

"ఈ నిద్రమొహాలేనా హరికథ వినేది?" అన్నాడు రామయ్య నవ్వుతూ.

♦ ♦ ♦

ఉదయాన్నే శ్రీదేవమ్మ గుమ్మంముందు కళ్ళాపుచల్లి, ముగ్గులు పెడుతూండగా రత్తమ్మచూచి హెచ్చరిస్తూ, "ఏమిటత్తయ్యా! రాత్రినువ్వు హరికథకు రాలేదేం?" అని అడిగింది.

"ఎక్కడ రత్తమ్మా! తిరికలేదు. మా భోజనాలయ్యేటప్పటికే బాగాపొద్దుపోయింది. అంతదూరం పోలేక వాలుగాలి పడినిద్దరోయాను. అవును, ఎలాగుంది హరికథ?" అని అడిగింది.

"ఎంచక్కా చెప్పాడనుకున్నావ్! ఆ బట్టతలాయన! ఆ యేసుదేవుడు గొడ్లపాకలో పుట్టటం, గొడ్లమధ్య పెరగడం, ఎన్నికష్టాలు పడతాడనుకున్నావ్! మన రామాయణంలో రాముడుకూడ అన్ని కష్టాలు పడలేదనుకో. అబ్బబ్బ! నిజంగా చెబితేనమ్మవు - నాకు ఏడుపు అంతగా పొర్లుకొచ్చిందత్తయ్యా! ఎంతమంచి భక్తి కీర్తనలు పాడాడనుకున్నావ్. అన్నట్టు సినిమా పాటలు కూడ పాడారు. ఇదివరకెప్పుడూ మనం అలాంటి హరికథ వినలేదంటే నమ్ము - అంత గమ్మత్తుగా చెప్పారు."

"కథ పూర్తిగా చెప్పేశారా?"

"చుక్క పొడిచేటప్పటికి సగం కథ మాత్రమే పూర్తయింది. అంతటితో ఆపేసి మిగతా కథ ఈ రాత్రికి చెబుతానన్నాడు. రాత్రి ఆయనకు పూలమాల వేసి తాంబూలంతో బాటు పదిరూపాయలు కూడ యిస్తారట. వస్తావూ?"

"తప్పకవస్తా. మనిద్దరం కలిసివెళ్దాం. నువ్వు పోయేముందు మా గుమ్మందగ్గర కొచ్చి ఒక్కకేకేసిపో." అంది శ్రీదేవమ్మ.

చీకటి పడింది. రామయ్య పొలంనుంచి తిరిగొచ్చి స్నానంచేసి విస్తరిముందు కూర్చున్నాడు. బుజ్జాయ్, గోపి వెన్నెట్లో హాయిగా నిద్రపోతున్నారు. విస్తట్లో అన్నం వడ్డిస్తూ "ఏవండీ! రాత్రి హరికథ మా గమ్మత్తుగా వుందటగా?" అంది శ్రీదేవమ్మ.

బీరకాయ కల్చు గూరతో అన్నం కలుపుకుంటూ "ఎవరు చెప్పారు? రాత్రి హరికథ లేదన్నాడుగా గోపీ. అయినా దొంగవెధవలు. వాళ్లకుతోడు హరికదా కటీ!" అని సణుక్కున్నాడు రామయ్య.

"ఏవండోయ్ అలాగంటారు! లక్షణంగా రత్తమ్మ రాత్రివెళ్లి చూసొచ్చి నాతో చెబితే ... ఈ పూటకూడ మిగతాకథ చెబుతారట. తొందరగా కానివ్వండి. నేను రత్తమ్మతో వెళ్లి ఈపూటైనా వినొస్తాను." అంది శ్రీదేవమ్మ.

"ఇంకెక్కడి హరికథ? ఆ బట్టతలోడికి సంకెళ్లు తగిలించి తీసుకెళ్లారు పోలీసులు."

"ఏఁవిటీ!" అంది పరధ్యాన్నంగా శ్రీదేవమ్మ చారుకు బదులు అన్నంలో మజ్జిగవడ్డిస్తూ.

రామయ్య మండిపడుతూ "ఏమిటి మతిపోయిందేం? నువ్వుగూడ కిరస్తానీ దానవై ఆబట్టతలోడివెంటబడతావా?" అని కసిరాడు.

శ్రీదేవమ్మ, రామయ్య కోపంచల్లారే వరకూ నోరెత్తలా. భోజనమైనతరువాత రామయ్యకు తమలపాకులు అందిస్తూ

"ఆయన్నెందుకు లాక్కెళ్లారు?" అని అమాయకంగా అడిగింది శ్రీదేవమ్మ.

"వాడిని 'ఆయన' అంటే ఆగ్నెల్ల పాపం చుట్టుకు నేను. హుఁ, హుఁ" అని పొడిగానవ్వి "వాడిదసలు ఉత్తర దేశంట. ఇక్కడవాడు కాదు. ఉత్తర దేశంలో ఎక్కడో ఓ పల్లెకొంపట"–"అయితే!" అని అడ్డుతగిలింది శ్రీదేవమ్మ.

"చెప్పేది విను. వాడు అక్కడోక పేరుమోసిన దొంగల ముఠానాయకుడట. సంవత్సరంక్రిందట వాడిని పట్టుకోబోతే కానిస్టేబులునే ఖూనీ చేశాడట. అప్పటి నుంచీ పోలీసుల కంట బడకుండా యిలా దొంగవేషాలు వేసుకుని తిరుగుతున్నాడు. నిన్నసాయంత్రం యేటిగట్టున మామిడి తోపులో వాడు తప్పతాగి మాంచినిషాలో వుండగా ఎవళ్లో వెళ్లి పోలీసులతో చెప్పారట. మిగతాయిద్దరూ అంతులేకుండా పరారయ్యారు" అని ముగించాడు రామయ్య.

"పాపం!" అంది అప్రయత్నంగా శ్రీదేవమ్మ తన బంధువెవరో బందీ అయినట్టు.

# శ్రీమతి పొణకా కనకమ్మగారి జీవితం

శ్రీ నెల్లూరు వెంకటరామానాయుడు

జననం: నందన, జ్యేష్ఠశుద్ధ పౌర్ణమి, శుక్రవారం (10-6-1892) పుట్టుక పొట్లపూడి అవ్వగారింట. తండ్రి ఆధ్యాత్మిక సంపన్నుడైన మరుపూరు కొండారెడ్డి, తల్లి చేతికొద్ది అన్నదానంజేసిన కామమ్మ. విద్యాభ్యాసం సామాన్యమే. వివాహం తొమ్మిదవ యేట. భర్త మేనమామగారైన పొణకా సుబ్బరామిరెడ్డిగారు. వీరి కుటుంబం నెల్లూరు తాలూకా పొట్లపూడిలో. బాల్యంలోనే దానధర్మములు పెద్దవారికి తెలిసీ తెలియకుండా, పేదవాళ్ళకు తిండిగాను, ధాన్యంగాను, వస్త్రాలుగాను యిస్తుండడం కద్దు. పొట్లపూడిలో వీరి కుటుంబంవారు కట్టించిన చంద్రమౌళీశ్వరాలయ బ్రహ్మోత్సవాలు, బ్రాహ్మణ సంతర్పణలు వేలకొలది జరిగేవి. అదిగాక చుట్టు ప్రక్కలంతా బ్రాహ్మణ కండ్రిగలు విశేషంగా వున్నందున నిరంతరం వారికి అన్ని విధాల సహాయాలు చేస్తుండడం కద్దు. వీరి తల్లిగారి కుటుంబం అన్నదానంలో జిల్లా కంతటికీ ప్రశస్తిగన్నది. అట్లనే వీరి కుటుంబంకూడా అహర్నిశం అన్నదానంలో ప్రశస్తి గన్నది. ఈ కాలంలో రెడ్ల కుటుంబాల్లో సాధారణంగా ఘోషాపద్ధతి వుండేది. వీరి కుటుంబంలో మాత్రం ఆ పద్ధతిలేదు. ఎవరు వచ్చినా కనకమ్మగారే స్వయంగా ఎదురేగి సగౌరవంగా ఆహ్వానించి వుచిత మర్యాదలు చేయడంకద్దు. పెద్ద కుటుంబాల్లో వచ్చిన అతిధులకు వంటవాడే వడ్డన చేయడం ఆచారం. వీరి కుటుంబంలో మాత్రం అట్లాగాదు. కనకమ్మగారే స్వయంగా వచ్చినవారికి వడ్డిస్తేగాని ఆమెకు సంతృప్తిలేదు. పెద్ద కుటుంబం. కనకమ్మగారే పెత్తనదారు. నరములేనిచెయ్యి. ఇక అన్నివిధాల దానధర్మాలకు అంతే వుండేది కాదు.

ఇదంతా పూర్వచరిత్ర. 1913 సంIIలో యీమెగారి ప్రోత్సాహం, అర్థ, ఆదరాలక్రింద పొట్లపూడిలో సుజనరంజనీ సమాజం నెలకొల్పబడింది. దీనిక్రింద అనేక శాఖలు పనిజేసినవి.

## గ్రంథాలయోద్యమం

అప్పుడే ఆంధ్రోద్యమ ప్రారంభ దినాలు. అయ్యంకి వెంకట రమణయ్యగారి నాయకత్వంక్రింద గ్రంథాలయోద్యమం ప్రారంభమైంది. దాని ప్రాభవం పొట్లపూడికి ప్రాకింది. ఎన్నో పర్యాయములు అయ్యంకి మున్నగు నాయకులు పొట్లపూడి రావడం, జిల్లాకు కేంద్రంగా వుద్యమం సాగడం, ఎన్నో సభలు, సమావేశాలు నిరంతరం జరుగుతుండేవి.

ఈ సమాజ అధ్వర్యాన పొట్లపూడిలో వివేకానంద పుస్తక భాండాగారం, పొగడ దొరువులో శ్రీరామ ప్రసాద కోశనిలయం, కొత్తూరులో గోఖలే పుస్తక భాండాగారం, ఇందుకూరు పేటలో ఎ. యస్. యన్ పఠనమందిరం - యివన్నీ పది సరాల్లో స్థాపింపబడినవి. అనుయాయు లెందరున్నా దీనికంతా లోపలుండి కృషిజేసి ధనాన్ని వెదజల్లింది కనకమ్మగారే.

## సభలు, సమావేశాలు

1914 సంవత్సరంనాటికే పొట్లపూడిలో రాజకీయ బీజం నాటబడింది. వెన్నెలకంటి రాఘవయ్య, సి. వి. కృష్ణగారలు బీజవ్యాపకులైనా తద్వ్యాప్తిఅచిరకాలంలోనే కనకమ్మగారి అధ్వర్యంక్రింద తీవ్రరూపం దాల్చినవి. ఆనాటికి జిల్లాలో మరెక్కడా రాజకీయ చైతన్యంలేదు. ఆ నాటికి మన ప్రధాన మంత్రిగా వున్న గోపాలరెడ్డిగారు ఏడుసంవత్సరాల బాలుడు మాత్రమే. ఇక్కడ రాజకీయ సాంఘిక సారస్వత సభలెన్నో నిరంతరం జరుగుతుండేవి. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరశింహం, అయ్యదేవర కాళేశ్వరరావు, ఆచంట లక్ష్మీపతి - రుక్మిణమ్మ, దంటు సుబ్బావధాని, కాంచనపల్లి కనకమ్మ శ్రీ కాశీనాథుని నాగేశ్వరావు, ఉన్నవ లక్ష్మీనారాయణ మున్నగు పెద్దలంతా విచ్చేసి తమ అమూల్య సందేశముల నొసగు చుండిరి.

ఆ నాటి రాజకీయ నాయకుడు తిలక్ మహాశయుడు. అప్పటికి ఖద్దరు వుద్యమంరాలేదు. నూలు ఎక్కడదైనా, నేత యిక్కడ జరగడమే స్వదేశీగా భావింపబడేది. ఆ స్వదేశీ వుద్యమంగూడ యిక్కడ బాగా ప్రబలింది. ఆ వూరులోనే స్వదేశీ నేత సంఘమనే కష్టానాగుంట స్థాపింపబడి చక్కటి చీరలు ధోవతులు, కండువలు మున్నగునవి నేయించబడు చుండెను. అట్టి ప్రశస్తమైన వస్త్రాలతో నేడు దొరికిన ఎడల చీరలు ధోవతులు చేనేతవారికి ప్రత్యేకించవలెననే నినాదానికే అవకాశముండేదికాదు. ఖద్దరు ప్రారంభంతో ఆ సంఘం అస్తమించింది.

## కలరా సహాయం

ఈ సమాజం అధ్వర్యంక్రింద ఆ గ్రామంలోనే గాక ఏ ప్రదేశానికైనా వెళ్లి కలరామందులిచ్చి రోగుల కుపచర్యలుజేసి సహాయపడడం కద్దు. ఒకనాడు అందరు సేవకులు తలావొక ప్రదేశానికి కలరా సేవక్రింద వెళ్లినారు. మాదిగవాడలో కలరా తగిలిందని కనకమ్మగారివద్దకు మనిషి వచ్చారు. ఆమె చేతిక్రింద ఎవ్వరూ కనపడలేదు. బ్రహ్మశ్రీ చతుర్వేదుల రాఘవయ్యగారొక్కరు మాత్రం వున్నారు. వీరు చక్కని ఆగ్నికపరులు. అస్పృశ్యత చక్కగా పాటించేవారు. చక్కటి విద్వాంసులు. రాజకీయ సారస్వత విజ్ఞానులు. తిలక్ పూజ్యపాదుల ప్రియ శిష్యులు. వీరు ఆ కాలంలో ఆమెగారివద్ద ఆస్థాన పండితులుగావుండి "స్వతంత్రయుద్ధం" (War of Independance) తెనుగిస్తున్నారు. కొంతసేపు యీ రచన, మధ్యాహ్నంపూట పురాణ కాలక్షేపం జరుగుతుండేది. ఆ నాడు మరెవ్వరూ లేనందున కనకమ్మగారు శ్రీ రాఘవయ్యగారిని సమీపించి, స్వామీ యీ సమయంలో ఎవ్వరూలేరే, ఏమి కర్తవ్యం అన్నది. వెంటనే ఆ మహానుభావుడు "నేనువెళ్లి మందులిచ్చి వుపచరిస్తా"నని సంతోషంతో సమ్మతించి మందులు తీసుకొని మాదిగవాడకు వెళ్లి అంటరానితనాన్ని మరచిపోయి కలరా రోగికి మందులిచ్చి ముట్టుకొని సకలోపచర్యలు జరిపి మధ్యాహ్నం మూడు గంటలకు యింటికివచ్చి జంధ్యం తీసివేసి ప్రాయశ్చిత్త కాండ నిర్వర్తించి తర్వాత వంట జేసుకొని భోంచేశాడు. నిజమైన బ్రాహ్మణీకం ఎట్టిదో నిరూపించి అస్పృశ్యత కారణాలను వ్యాఖ్యానించి వుపద్రవాల్లో ప్రజల నుపకరించడం ఎంతటి నిస్వార్థ ధర్మమో బోధించాడుగూడ. "నిందు సుతంబు నవ్వ నవనీప సమానయు పల్కు దారుణాఖండల శస్త్రతుల్యము" అన్న పద్యం యీ బ్రహ్మస్వరూపిలో మూర్తీభవించి యుండేది. దీన్నిబట్టి ఆనాటి పోట్లపూడి యూనివర్సిటీలో ఎంతటి వుత్తమ ధర్మ నిర్వహణ జరుగుతుండేది అర్థమౌతుండేది.

## హరిజన సేవ

ఆనాటికి గాంధి రాలేదు. హరిజనోద్ధరణ వుద్యమం ప్రారంభంకాలేదు. ఒకే సమయంలో ఆ వూరి మాలవాడ పూర్తిగా ఆబాలవృద్ధులు యిన్ఫ్లూయెంజా జ్వరంతో పడిపోయింది. ఇళ్లల్లోవున్న జనాభా అంతా పడకపెట్టింది. కనకమ్మగారి భర్త సుబ్బరామిరెడ్డిగారికి మాలవాడంటే అమిత ప్రాణం. వారికి సహాయపడటమంటే అదొక సర్దాగా విద్యుక్తంగా వుండేది. ఆ సమయంలో కనకమ్మగారి యింట్లోగూడ పనివాళ్లంతా పడకబెట్టారు. వంట గూడ స్వయంగా చేసికోవలసినస్థితి ఏర్పడ్డది. ఆ వుపద్రవ సమయంలో యింత పెద్ద మాలవాడను కాపాడాలనుకొన్నది ఆమెగారు. పైపెచ్చు మాంచి వర్షం, . ఎడాతెరిపి లేకుండా వర్షం కురుస్తున్నది. మాలవాడ వూరుమధ్య గొంతుబంటి నీటి ప్రవాహంలో దాటుకొని పోవలసినట్లున్నది. ఆ సమయంలో యింత మాలవాడకు జావకు కావలసిన నూక తాము తమ తల్లిగారు స్వయంగా తయారుజేసి జావకాచి తగిన మనుష్యులద్వారా ప్రతి వ్యక్తికి కావలసిన జావ, రెండు పూటల మందులు యిచ్చి పంపి ఆ జ్వరాలు పూర్తిగా నెమ్మదించేదాకా యీ విధంగానే ప్రతిదినం అన్ని విధాలా వుపచరించి వారిని కాపాడింది. ఇంతటి సాంఘిక సేవానిరతి గల్గిన మాతృమూర్తి సామాన్యంగా లభించడం అరుదు.

## రాజకీయ విప్లవం

ఆ దినాల్లో తిలక్ గారి అధ్వర్యాన విప్లవ విధానం బీజాలు యిక్కడగూడ నాటబడి రెమ్మ వేసి దిన దినాభివృద్ధి అగుచుండినవి. ఈ రహస్య విధానాల్లో కొంత సాధన, కృషి సాగింది.

## హోంరూలు వుద్యమం

బిసెంటు హోమురూలు వుద్యమ ప్రచారంగూడ యిక్కడ సాగింది. ఆ స్వాతంత్ర్య పిపాస దినాల్లో ఏవుద్యమం కనుపించినా దాన్ని కౌగలించుకోవడం పరిపాటి అయింది. బిసెంటు శిష్యుడు రంగనాథ మొదలియార్ గారు యీ వూరు రావడం, చుట్టు ప్రక్కల ప్రచారం సాగడం హెచ్. ఆర్ బిళ్లలు అందరూ తగిలించుకోవడం యిదంతాగూడ కనకమ్మ గారి సహాయ సానుభూతులతో సాగింది.

## గాంధీ వుద్యమం

ఈ పరిస్థితుల్లో గాంధీజీ సబర్మతీ ఆశ్రమాన్ని స్థాపించడంతో ఆ యింతర్వాహిని తీగలు యిక్కడను వెంటనే ప్రాకినవి. కనకమ్మగారింట్లో, తచ్ఛేవకుల్లో అహింసా వ్రతధారణం, మాంసాహార విసర్జనం, రాట్నముల స్థాపన జరిగింది. కనకమ్మగారికి వడ కడం తెలియదు. వారి తల్లిగారు పెద్ద కుటుంబ మైనా వడకడంలో మంచి నిపుణత సంపాదించిన చెయ్యి. తన్మూలంగా కొద్ది రోజుల్లోనే కనకమ్మ గారు వడకడం, బాగా వడకడం నేర్చుకున్నది. ఆమెగారు ఆమె తల్లిగారు మాత్రం స్వయంగా వడి కిన నూలుతో 54 అంగుళాల వెడల్పుగల పంచలు నేయించి మొదటి వెడల్పు పంచల జత కనకమ్మగారు భక్తి పురస్సరంగా గాంధీజీకి పూజా పుష్పంగా పంపుకున్నారు.

## సెమీ పూజ

ఇక్కడ స్వాతంత్ర్యోజ్జ్వల పొంగు విపరీతంగా వున్నది. విజయదశమినాడు జమ్మిచెట్టువద్దకు దేశ భక్తులంతా వ్రతధారణకు సెమీపూజకు వెళ్లడం అక్కడ పూజ, కంకణధారణ ఎంతో వుత్సాహంగా జరిగేది. "కంకణ విసర్జనులకిది కాలమగునె" అనే శుభదినాలవి

రాయప్రోలు సాహిత్యం చక్కగా వుపాసింప బడేది. రాయప్రోలు సుబ్బారావుగారు ఆనాడు కనకమ్మగారి ఆస్థాన పండితులంటే ఆప్త బంధువు లంటే తప్పుగాదు. వారు వ్రాసిన గీతాలు, వారు వ్రాసిన పద్యాలు వుద్బోధకరంగావుండి యువక రక్తాన్నంతా వుడికించేవిగా నుండేవి. ఒక దఫా సెమీపూజనాడు పోట్లపూడిలో రాయప్రోలుగా రుండడం తటస్థించింది. ఆ సమయంలో వారు వ్రాసిన పద్యాలు చిరస్మరణీయంగా మణిపూసలై ఆంధ్ర సాహిత్య వీధిలో సజీవంగా కళకళలాడు తున్నవి.

అర్జునుడు సెమీవృక్షం దగ్గరకువచ్చి ఉత్తరుణ్ణి ప్రబోధిస్తున్న ఘట్టం అది:—"పన్నెండేళ్లు కటు ప్రవాస గహనావాసంబులంద్రోసి యీ సన్నన్ జచ్చియు జాని చందమున అజ్ఞాతంబు పోద్రోసి రక్తార్ణంబుల్ బలిగోరుచున్నవి..." "మగవాడాడుదిగాక వీరపదవీ మానాభిమానంబులన్ తగులం బెట్టితి అన్న మాటలని బద్ధద్వేష కాంతారమున్ దెగ ఖండిం పగనైతి భారతకథా దీపంపై చల్లారిపోవుగతుల్ బట్టిన యేటికో బ్రతికి నీవున్నేను పాడుర్విపై" "చావన్నన్ భయమేల శూరులకు స్వేచ్ఛాహీన జీవంబులె చావులకంటె హేయమగు" ఆ సెమీపూజ నాటి యిత్యాది పద్యాలు ఆ నాటి రాజకీయ వాతా వరణాన్ని నిరూపించగలవు.

ఒకనాడు కనకమ్మగారు పుట్టిన గ్రామంలో వుగాదినాటి ప్రచార సందర్భంగా రాయప్రోలు రచించిన పద్యం యిది:—"ప్రాణమ్ముల్ పూలట్ల జల్లెదరు సంగ్రామమ్మునన్ వీరకళ్యాణీ కాముకులై భవత్తనయు వుల్లాసంబునన్ దేశవాగ్వీణా గానము సేయువమ్మ జననీ స్వేచ్ఛాదరిద్రాణమా క్షోణీ స్వర్గ కవాట బంధనము విచ్చున్ నూత్న వర్షమ్ముతో"

ఈ మచ్చు తునకలు ఆ నాటి కనకమ్మగారి కృషిని, రాజకీయ వాతావరణాన్ని తెలుపగలవు.

## పల్లెపాటి ఆశ్రమ స్థాపన

పొట్లపూడి గ్రామంనుండి సి. వి. కృష్ణగారు సబర్మతీ ఆశ్రమ శిక్షణానికివెళ్ళి తర్ఫీదుపొంది శ్రీ దిగుమర్తి హనుమంతరావుగారితో వచ్చివేయడం, యిక్కడ పల్లెపాటిలో పినాకినీ సత్యాగ్రహ ఆశ్రమం అను పేరుతో ఆశ్రమాన్ని స్థాపించాలని కృషిసాగింది. మంచి ఆర్థిక యిక్కట్టు దినాలు. డబ్బు యిబ్బంది ఎక్కువగావుంది. ఆ కష్టదినాల్లో కనకమ్మగారు తన మెడలో నగలమ్మి పల్లిపాడు పినాకినీ తీరాన 13 ఎకరాల భూమిని చక్కని చెట్లు మున్నగు వాటితో ఆశ్రమానికి ఎంతైనా తగిన దానిని కొనియివ్వడం జరిగింది. గాంధి మహాత్ముని చే ఆశ్రమ స్థాపన యిత్యాదులు చిరస్మరణీయాలైనవి.

## స్త్రీల కాంగ్రెసు

1920 సంవత్సరాన్నుండి కాంగ్రెసు వుద్యమంతో యీమె గారికి ప్రత్యక్ష సంబంధం ఏర్పడడం, స్త్రీల కాంగ్రెసు సంఘస్థాపన, రాట్నాల ప్రచారం, ఖద్దరు వ్యాపకం, యిదంతా మహత్తరంగా సాగింది. కాకినాడ కాంగ్రెసులో స్త్రీ వాలింటీరు దళ నాయకత్వం వహించి జరిపిన సేవ అనన్యమైంది. ఈమెగారు ఒక మాటు ఆంధ్రరాష్ట్రీ కాంగ్రెసు ఉపాధ్యక్షిణిగాను, పలుపర్యాయములు రాష్ట్రీ కాంగ్రెసు సభ్యులుగా నుండిరి. 1922 ఆలిండియా కాంగ్రెసులలో సభ్యులుగా మొదటివారిగా వుండిరి.

## శ్రీ కస్తూరిదేవి విద్యాలయ స్థాపన

1923 లో నెల్లూరు ముత్తరాజువారి వీధిలో యీమె గారిచే శ్రీ కస్తూరిదేవి విద్యాలయ స్థాపన జరిగింది. దీనికి శ్రీ ప్రకాశం పంతులుగారు ప్రారంభోత్సవం జరిపారు. ఇందు బాల బాలికలకు జాతీయ విద్య, వడుకు, నేయుపని మున్నగు చేతివృత్తులు నేర్పబడుచుండెను. దీని ప్రధానోపాధ్యాయులు రాళ్ళపల్లి రామసుబ్బయ్యగారి ఆదర్శ జీవితం, త్యాగనిరతి ఎన్నాళ్ళకైనా మరచిపోవడానికి వీలులేనిది. ప్రతి యింటా ముంతలుబెట్టి బియ్యంసేకరించి దీని నిర్వహణ సాగుచుండెను. [illegible] గారు మునిసిపల్ చైర్మన్‌గా వుండగా ఆయనున్ను దర్శించి దీనిని రికగ్నైజు చేయించిన యెడల దీనికి డబ్బు సహాయం చేస్తానని చెప్పగా ఆమె పూర్తిగా తిరస్కరించింది. అప్పుడే జిల్లాబోర్డు నామినేషన్ ఆహ్వానం వచ్చినప్పుడుగూడ ఆమె యిట్లే తిరస్కరించింది. ఈ విద్యాలయానికి మొదట స్త్రీల కమిటి వుండేది. ఒక కమిటీచేసి నిర్వహించబడుచుండెను. కె. వి. రాఘవాచార్యులు కమిటీ అధ్యక్షులుగా నుండిరి. ఈమెగారు 1930 లో జైలుకు వెళ్తూ కొంత డబ్బును కమిటీవారి చేతికిచ్చి వెళ్ళిరి. ఆమె జైలుకు వెళ్ళిన తర్వాత ఏనుగ రాఘవరెడ్డిగారు కమిటీ కార్యదర్శిగా నుండిరి. ఆమె పెట్టిపోయిన డబ్బుతో నున్న మరికొంత డబ్బును ఆస్తితాకట్టుమీద నున్ను తెచ్చి నిర్వహించిరి. డబ్బు అయిపోగానే విద్యాలయం నిల్పివేయబడింది.

## గాంధీగారిచే శంకుస్థాపన

ఈ విద్యాలయభవన నిర్మాణానికి సుమారు 12 వందల అంకణాల ప్రదేశం కనకమ్మగారిచే సంపాదించబడింది. 1929 సం॥లో గాంధీగారి ఆంధ్రదేశ సంచారంలో నెల్లూరు విచ్చేసినప్పుడే మహాత్మునిచే యీ విద్యాలయ శంకుస్థాపన మహోత్సవంగూడ జరిగింది. ఆ నాడు మహాత్మాజీ "ఈ విద్యాలయానికి సహాయపడండి. మీరు నెల్లూరులో చూడదగిన దేదైనా వుంటే అది కస్తూరీదేవి విద్యాలయమే." అని బహిరంగోపన్యాసంలో జెప్పిరి. మహాత్ముల సంకల్పాలు అమోఘములుగదా! అనాటి వాక్కులు యీనాటి కుపకరిస్తున్నవి.

## కారాగార శిక్ష

1930 వుప్పు సత్యాగ్రహంలో యీమెగారికి ఆరుమాసాలు కఠినశిక్ష విధించబడింది. తర్వాత

విదేశీ అంగళ్ళవద్ద పికెటింగు, సారాదుకాణాలవద్ద పికెటింగు విపరీతంగా సాగింది. ఈ వుద్యమానికి ఆంధ్రదేశం నలుమూలలనుండి అనగా గంపలగూడెం, ఖండవల్లి, కుర్తాళంనుండేగాక శ్రీ బాలంత్రపు నిశ్చేసి కనకమ్మగారి నాయకత్వంక్రింద పికెటింగు కొనసాగించిరి. ఆ సందర్భంలో నెల్లూరు సంతపేట సారా దుకాణం పికెటింగుచేసినందుకై 1932 సంllలో 1½ సంవత్సరం కారాగార శిక్ష విధించబడెను.

జైలులో యీమె గారికి విపరీతమైన జబ్బుచేసింది. ప్రాణాపాయస్థితిగూడ కలిగింది. ఈమె జైలులో హిందీ అభ్యసించి, తెనుగు భాషాంతరీకరణాలుగూడ సాగినవి.

## కుమార్తె మరణం

ఈమెగారు జైలునుంచి వచ్చిన తర్వాత అనారోగ్యమేర్పడ్డది. అందువల్ల విద్యాలయ పునరుద్ధారణ జరగలేదు. ఇంతలో అత్యంత ప్రీతిపాత్రమైన ఏకైక పుత్రిక వెంకట సుబ్బమ్మగారు చనిపోయినారు. దాంతో కనకమ్మగారి ఆరోగ్యం పూర్తిగా చెడిపోయింది. ఆరోగ్యం కోలుకుంటూ శాంతి ప్రసాదనకు శ్రీ రమణమహర్షిగారి పాదసన్నిధి లభించింది. దాంతో కొంత ప్రశాంతం ఏర్పడ్డది. తర్వాత సిథిలమైయున్న పల్లిపాడు ఆశ్రమంలోచేరి సాధనజేసుకుంటూ నిర్జీవమైయున్న ఆశ్రమానికి తిరుగా సజీవం కల్పించి కాంగ్రెసు స్వర్ణోత్సవాన్ని మండలానికి అగ్రత్వంగా బ్రహ్మాండంగా జరిపింది. ఆశ్రమ స్థలాన్ని యీమె భుక్తపరుచుకుంటుందేమో ననే భయంతో కొందరు స్వార్థపరులు ఆమెపై కుట్రలు పన్నారు. దానితో అక్కడనుంచిలేచి మహర్షుల ప్రధాన శిష్యులైన కోవూరు తాలూకా అన్నారెడ్డి పాళెంలోని శ్రీరామయోగిగారి ఆశ్రమంలోచేరి ఆధ్యాత్మిక జీవనం గడుపుతూ అక్కడ కూడ శ్రీరామయోగిగారి వర్ధంతులు జరుపుతూ పెద్ద సంచలనాన్ని కలిగించింది. అక్కడ గ్రంథాలయం గూడా స్థాపించింది.

## తిరుగా విద్యాలయ పునరుద్ధారణ

ఇట్లా వుండగా నెల్లూరు దర్గామిట్టలో ప్రశాంత వాతావరణంలో 20 ఎకరాల భూమితో బంగళా విద్యాలయానికి అనువైనది. శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారు ఈ ప్రదేశాన్ని కొని కస్తూరిదేవి విద్యాలయాన్ని హైస్కూలుగా తిరుగా ప్రకటిస్తే బాగుంటుందనే సంకల్పం కలిగింది. రామిరెడ్డిగారి తీవ్రకృషితో కనకమ్మగారుకూడ కలుసుకొని ఆ ప్రదేశాన్ని తీసుకొని 16-6-1944 లో హైస్కూలుగా ప్రారంభింపబడడం జరిగింది. మొదటిసారిగా జాతీయ ప్రభుత్వం గానున్న సందర్భంగా దీనిని హైస్కూలుగా స్థాపించుటకు సమ్మతింపబడ్డది. 40 మందితో ప్రారంభమైన ఆ విద్యాలయం నేడు నాల్గయిదు వందలమంది విద్యార్థినులతో నిండిన ప్రవర్ధమానమై మహోజ్వలంగా యీ నాడు కనిపిస్తున్నది.

## పారిశ్రామిక విద్యాలయం

ఇది యిట్లా వుండగా ఆమె ప్రధాన సంకల్పం ఆడవారికి చేతివృత్తులు నేర్పవలెననేది. అది యీ విద్యాలయంలో ధనాభావంవల్ల జరుగలేదు. అందువల్ల కస్తూరిదేవి ఇండస్ట్రియల్ స్కూలు అను పేరుతో పారిశ్రామిక పాఠశాల స్థాపించబడింది. దుర్గాబాయి, దేశముఖ్ గారలు విచ్చేసి ఆశీర్వదించిరి. ఈ పారిశ్రామిక విద్యాలయంలో నేత, అద్దకం, ఎంబ్రాయిడరీ మున్నగు కుట్టుపనులు నేర్పబడుచున్నవి. ఇక్కడ నేర్చుచున్నవారు వుపాధ్యాయినులుగా పోవడానికిగూడ ట్రెయినింగ్ కోర్సుకద్దు. ఇప్పుడు 80 మంది విద్యార్థినులిక్కడ తర్ఫీదు పొందుచున్నారు. దీనిని అయిదు సంవత్సరాలు ఢిల్లీలో లేడీ యిర్విన్ కాలేజిలో వుత్తీర్ణత పొందిన కనకమ్మగారి చెల్లెలు కుమార్తె వసుంధర అధ్వర్యాన నిర్వహింపబడుచున్నది. దీనికి మునిసిపాలిటీవారు భవన నిర్మాణార్థం కొంత స్థలంగూడ వుచితంగా యిచ్చియున్నారు. ఇక భవన నిర్మాణము యిత్యాది కార్యములు సాగవలసియున్నవి.

కనకమ్మగారికి 63 సంవత్సరాల వయస్సులో జబ్బుతో బాధపడుతూ సరయిన ఆరోగ్యంలేక తిరగడానికి అవకాశంలేక నిరంతరం పారిశ్రామిక విద్యాలయాభ్యుదయ కాంక్షతో క్రుంగిపోతున్నది. మహాశయులు ఆదుకొని ఆమె చరమ కాంక్షను నిర్వర్తించుట వుత్తమ ధర్మం.

## వీరి కవిత్వము

మొదట పొట్లపూడిలో గృహలక్ష్మి, హిందూసుందరి పత్రికలకు పద్యాలువ్రాసి పంపుచుండెడివారు. సమదర్శినిలోకూడ వీరి కవిత్వము ప్రచురింపబడినది. ఇంటివద్ద కొన్ని పద్యాలు వ్రాసియుంచిరి. అవన్నియు వారి యింటి దహనములో ఆహుతి కాబడినవి. తరువాత రమణాశ్రమములో వీరి మిత్రులయిన శ్రీ లక్ష్మీబాయమ్మగారితో కలిసి రమణగీత, భగవద్గీత పద్యములు వ్రాసిరి. అవి యింకా అచ్చుకాలేదు. శ్రీ రమణ మహర్షి గారిచే కూర్చబడిన శివానందలహరి, వివేకచూడామణి, భగవద్గీతలోని శ్లోకములకు "జ్ఞాననేత్రము" అను పేరట శ్రీ లక్ష్మీబాయమ్మగారు, కనకమ్మగారు కలసి ప్రచురించిరి. ఇటులనే ఆరాధన, నైవేద్యము, శ్రీ భగవానులకు భక్తి శ్రద్ధగా, రెండు చిన్నపద్య కావ్యములుగా ప్రచురించిరి. అప్పుడప్పుడు విడిగా పద్యములు వ్రాయుట వీరికి అలవాటు. అన్నారెడ్డి పాలెమునందుండు సమయమున శ్రీరామయోగిగారి జీవితము, శ్రీ గురుదేవుడని వ్రాసి అచ్చువేయించిరి.

# తారా సందేశం

శ్రీ చల్లా లక్ష్మీనరసింహశాస్త్రి

మిలమిల మెరిసే
తారల్లారా!
కిలకిల కూసే
కోయిల్లారా!
జలజల వచ్చే
సెలయేరుల్లారా!
కన్నారా మీరైనా
రమ్మన్నారా! నన్నైనా!
ఓ! మిలమిల మెరిసే.. ... ..

కళలను విరిసే
కళాపూర్ణుడా
కనుగొన్నావా!
నీవైనా!
వినిపొమ్మన్నావా
ఏమైనా
ఓ! మిలమిల మెరిసే.. ...

మధుగంధముతో
మైమరపించే
మలయానిలయా!
నీవైనా!
మన్నన సేయువ
నన్నైనా!
ఓ! మిలమిల మెరిసే .. ..

పంచభూతములు
మీరైనా
పంతము వీడరె
ననుబ్రోవ!
ప్రణయరాశినీ
ప్రేమమూర్తినీ
పరుగున జేర్చరె
నాదరికి!...
ఓ! మిలమిల మెరిసే......

హృదయవేదనతో
యీరీతిగ నే
నెంతకాలమని
ఎదురుచూతునో
తెలియజేయరే
ప్రియసఖితో యీ
దీనుని పలుకులను!
ఓ మిలమిల మెరసే
తారల్లారా!

---

# నక్షత్రాలు

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మ

ఏమి బోగొట్టుకొంటివో యిందువదన
వంగి వెదకుచు బోయెదు? వయసు కాద
పోయెగాకేమి; దొరకదపూర్వమైన
యవ్వన ధనంబు దాని నే యరయుచుంటి

తలపూవై ముక్కంటికి
నలిగడి నెలరాజుఁ గాంచి వెలవెలఁబోయె నేఁ
తలపోయుచు చింతిల్లెదు
తెలియను కారణము నేమొ; తెలుపంగదవే

కరమరుదగు పూమాలిక
తరుణీ! మురిపెమునగూర్చి తడవాయెను యీ
కరణిన్ జూచెద పూరకె
పరులకొ? నీ కొరకొ; దైవప్రార్థనకొరకో

శర వేగంబున బోయెడి
పరవళ్ళను ద్రొక్కి కొనుచు భాగీరథి సా
గర సంగమాభిలాషయొ;
అరయగ లోకోపకార యాత్రోత్సుకమో,

అడుగు గదల్పక యచ్చో
పగటి నిలుచుంటి వేల! పథికుండెవఁడో
పదలెరుఁగక పుడమి పయిన్
బడియుండెడి; యోగరతుఁడొ; పానరతుండో

జొన్న చేనికాడ కన్నె వన్నెల చిల్క
మల్లెవిరుల విరుల దురిమి మాపటేళ
వడిశెల్ల యేరి వడినిండ నిడుకొని
రువ్వనేల? వెకిలి నవ్వులేల.




# పిల్లి నాలుక చెట్టు

శ్రీ ఆమంచర్ల మల్లికార్జునరావు

అనగనగా చాలాకాలం క్రిందట ఒక కాకి వుండేది. ఆ కాకి ఒకచెట్టుమీద కూర్చుని వుండగా నోరు తెరుచుకొని నీళ్లలో వున్న ఒక పెద్ద మొసలిని చూచింది.

చూచీ చూడడంతోనే ఆ కాకికి ఒక దురాలోచన కలిగింది — ఏలాగైనా ఈ మొసలిని చంపి మాంసం తినాలీ అని!

అందుకు ఒక యుక్తి పన్నింది. తిన్నగా బయలుదేరి కాకి మొసలి వద్దకు వెళ్ళి "మిత్రమా! ఎంత కాలమని యిలా ఈ చిన్ననదిలో జీవితం వెళ్లబుచ్చుతావు? నీ పరిస్థితి నాకు విచారకరంగావుంది. నీకు ఒక చక్కని నదిని ఒక మైలు దూరంలోవుంది— చూపిస్తాను, వస్తావా" అని అడిగింది?

"అట్లాగా! మనకు యింతదగ్గరలో ఏ నదీవున్నట్లు నేను యింతవరకూ విన్నానైనా వినలేదే" అంది మొసలి.

"బాగావుంది నువ్వుచెప్పేది! అయితే నేను చెప్పేది అబద్ధం అనుకుంటూన్నావన్నమాట! నేను అసత్యమాడుతున్నాననేనా నీఉద్దేశ్యం! చూడు నన్ను గురించి నీకు తెలుసుననుకున్నాను. నా మనస్సు ఎటువంటిదో తెలుసా. నేనుఎప్పుడూమంచి దయార్ద్రహృదయంతో అందరికీ సహాయం చేయడమే పరమావధిగా తలుస్తాను" అంది కాకి.

ఆ మాటలకు మొసలి లోలోపల సంతోషపడి, నమ్మకం కలిగి కాబోలు "అయితే మరినన్ను ఎప్పుడు అక్కడికి తీసుకుపోతావూ?" అంటూ తన నమ్మకాన్ని వ్యక్తపరచింది మొసలి.

"సరే! తప్పకుండా బయలుదేరు. తప్పకనిన్ను తీసుకవెడతాను; కాని నువ్వు నడవగలవా?" అంటూ సందేహంగా అడిగింది కాకి.

"ఆ! ఆమాత్రందానికేనా — ఒకమైలు దూరం నడువలేనా" అంటూ ఎగిరి గంతేసింది మొసలి.

కాకి ముందుండి దోవచూపుతూంటే మొసలి ఆ వెనకనే నడక సాగించటం మొదలుపెట్టింది. అలా నడిచినడిచి ఒకమైలుదూరం పోయినవి.

కాకిని చూచి మొసలి "మిత్రమా! మనం ఒక మైలుదూరం నడచివచ్చేశాం. నువ్వు అన్న నది ఈ ప్రాంతంలో ఏక్కడా కంటికి దరిదాపులలో కనిపించదేం?" అంది.

వెంటనే కాకి అందికదా "యింతాచేసి మనమెంత దూరంవచ్చామేమిటి? మహావస్తే రెండు ఫర్లాంగులు అయినారాలేదు. అదీకాకుండా అంత పెద్దశరీరంగల నువ్వే ఈ మాత్రపు నడకకు అలసిపోయానంటుంటే నాకు చాలా సిగ్గుగావుంది" అంది.

కాకి అన్నమాటలు సహించలేకపోయింది మొసలి. పౌరుషంకొలదీ వెనకకైనా తిరిగి చూడకుండా ఒకే పట్టున మూడుమైళ్ళు నడిచింది మొసలి. అప్పటికీ నీళ్లు కనుపించక పోయేటప్పటికి చాల నిస్పృహ చెందింది. — "ఎక్కడా నీళ్లు"అని కాకిని అడిగింది.

అప్పటికే మొసలి చాల డస్సిపోయి శోషపోయింది. నీరసించిన కంఠంతో కాకిని మొసలి అడిగేటప్పటికి కాకి పకపక నవ్వి. "నీ మాంసం తినడానికే యీ పన్నాగం పన్నాను. నీకు నీళ్లు ఆహారం లేకుండ చేసి చంపాలనే ఇట్లు చేసాను. తొందరగానే చస్తావులే అప్పటికి నేనొస్తా" అంటూ కాకి తుర్రన అక్కడి నుంచి ఎగిరిపోయింది.

పాపం మొసలి ఒక్కతే దాహంతో అక్కడవుండి, అదే సమయానికి ఆ దోవన ఒక రైతు రెండెడ్ల బండిని తోలుకుంటూ వెడుతూ మొసలిని చూచాడు.

మొసలి ఆ రైతును చూసి తన కథనంతా చెప్పు కుని సహాయం చేయమని వేడుకొంది. మళ్లీ యథా ప్రకారం నదికి చేర్చమని ప్రాధేయపడింది.

జాలి హృదయం గల ఆ రైతు మొసలి బాధ చూచి సహించలేక జాలిపడి సరేఅని ఒప్పుకొన్నాడు.

మొసలి క్రూర జంతువు కదూ! అందుచేత ముందరే మూతిని త్రాడుతో గట్టిగా బిగించి బండి మీద వేసుకొని తిన్నగా నది ఒడ్డుకు చేర్చాడు. అక్కడ మొసలిని వదులుతానన్నాడు ఆ రైతు.

"అబ్బే! అసలే నీరసంగా వున్నాను నువ్వు చాలా పుణ్యం కట్టుకున్నావు. యింతవరకూ ఎలాగూ తీసుకువచ్చి నాకీ సహాయం చేశావు. యికకొంచెం సహాయం మాత్రమే చేసి పెట్టు. నువ్వు నన్ను గట్టు మీద వదిలేస్తే నీళ్లలోకి ఈదుకు వెళ్ళగలనా? అసలే నీరసంతో వున్నాను. కాబట్టి బండిని ఎద్దులకు నడుంవరకు నీళ్ళొచ్చేట్లు దింపి అక్కడ నీటిలో విడిపించమని" ప్రాధేయపడింది మొసలి.

ఆ రైతు మొసలి చేయదలచిన మోసం గ్రహించుకోక తన బండిని, ఎద్దులను నీటిలోకి తోలాడు. అక్కడ మొసలిని విడిచాడు. వెంటనే యిదే మంచి సమయం, తిరిగి ఆహారం వెతుక్కోవడం కష్టం కూడాను, అని తలుచుకుని ఒకసారిగా ఎద్దుల కాళ్లను పట్టుకొంది, మొసలి.

రైతు ఆ మోసాన్ని చూసుకొని "విడిచెయ్యి విడిచెయ్యి, అంటూ అరిచాడు. కాని మొసలి ఆ మాటలకు లక్ష్యపెట్టకుండా అలాగే కాళ్లను వదలకుండా పట్టుక కూర్చుంది.

అదే సమయానికి నీళ్లు త్రాగుదామని అక్కడికి వచ్చివుంది కుందేలు ఒకటి! ఆ కుందేలు రైతుని పిలిచి "నీ చేతికర్రతో బాదు" అని సలహాయిచ్చింది. కుందేలు మాట ప్రకారం అదే పనిగా బాదాడు రైతు. ఆ దెబ్బలకు ఉక్కిరి బిక్కిరి అయిపోయి వెంటనే మొసలి ఎద్దులని విడిచి నీటిలోనికి పారిపోయింది.

రైతు బ్రతుకు జీవుడా అనుకొని తన బండి తోలుకొని యింటికి వెళ్లిపోయాడు.

అప్పటినుంచీ "కుందేలి పని పట్టాలి" అని మొసలి సమయం కోసం పగతో కాచుక కూర్చుంది.

కుందేలు నీళ్లు త్రాగడానికి వచ్చినప్పుడు ఏదో విధంగా ఏమార్చి తినాలని నీటిమీద తేలుతూ వేచి వుండేది మొసలి.

నీటికోసం వచ్చిన కుందేలు అలా నీటిమీద తేలుతూ వుండే మొసలిని చూసి చిన్న యుక్తి పన్నింది. ఒక చిన్న పాట "నిజమైన మొసలి నీటికి ఎదురు యీదు; నిజమైన కొయ్యలు నీటికి కొట్టుకొని పోవు" అని పాడింది.

ఆ పాట విని మొసలి నీటిలో కొట్టుకుపోయి నట్లుగా నటించింది. ఆ సమయం కనిపెట్టి కుందేలు నీరు త్రాగి తిన్నగా పారిపోయింది.

మరునటి రోజున అదే విధంగా కుందేలు నీళ్లకోసం వచ్చి మొసలిని చూచి అలాగే పాట పాడింది. కాని యీసారి మొసలి మెదలకుండా వూరుకుంది. కుందేలు అది కొయ్య అనుకొని నీటికొరకు నీటిలోనికి దిగింది. ఇదే సమయం అని మొసలి కుందేటిని నోట్లో వేసుకొంది. కాని అప్పటికప్పుడే కుందేటిని చంపడం యిష్టం లేక నోట్లో వుంచుకొని నీటిలోకి పారిపోయింది.

నీటిలోకి వెళ్ళిన మొసలి ఆనందం పట్టలేక "హి, హి, హి, "అంటూ నవ్వుతుంది. నోటిలో కూర్చున్న కుందేలు తన చేతి గోళ్ళతో మొసలి నాలుకను కత్తిరించేసి, మొసలితో అంది. "నువ్వు, "హి, హి, హి" అని నవ్వగలవుకాని — "హ . హ, హ"అని నవ్వగలవా? నీ చేతకాదు," అంటూ హేళనచేసింది కుందేలు.

అందుకు బదులుగా మొసలి "హ — హ - హ" అని నవ్వింది. అలా నవ్వుతూండగా తెరుచుకొన్న మొసలి నోట్లోంచి కుందేలు ఒక్క గెంతులో బయటకు వురికింది, మొసలినాలుకతో సహా. అలాయీదుకుంటు గట్టుచేరుకుంది. మొసలినాలుకను భద్రంగా ఒకచెట్టు పొదలో దాచి యింటిదోవపట్టింది. కొంతదూరం వెళ్ళేసరికి ఒక పిల్లి కనుపించింది. "ఏం పిల్లి మామా బాగున్నావా? ఆకలితో వున్నట్లున్నావు. నాతోరా నీకు మంచి నాలుక ఆహారంగా యిస్తాను!!అని పిల్లిని పొదవద్దకు పిలుచుకొని పోయింది. కాని ఆ పొదలో ఎంత వెదికినా మొసలి నాలుక కనుపించ లేదు. మొసలి నాలుక దాచినస్థలాన ఒక విచిత్రమైన చెట్టు మొలిచివుంది. పిల్లీ, కుందేలు ఆశ్చర్యంగా చెట్టును చూచాయి. ఆ నాలుకే యిలా మారి వుంటుంది" అను కొన్నాయి. ఆ చెట్టు వేళ్ళు సన్నగా, పొడుగ్గా విస్తారంగా వున్నాయి. దానినే "పిల్లినాలుక చెట్టు" అంటారు. అది అసలు మొసలి నాలుక చెట్టు అయినా చివరికి "పిల్లి నాలుక చెట్టు" అయిపోయింది.

# "జబ్బు కుదిరింది"

శ్రీ పిళ్లా సుబ్బారావుశాస్త్రి

**ఒకప్పుడు** ఒక రాజుగారు వుండేవారు. **ఆయన** యిలా రాజ్యంలో ప్రకటన చేయించాడు- "రాజ్యంలో వున్న పండితులు క్రొత్త క్రొత్త పద్యాలను వ్రాసుకు రావాలి. ఎవరయితే క్రొత్త పద్యాలు వ్రాసుకొస్తారో, వాళ్లకి ఆ పద్యాలు ఎక్కడ వ్రాస్తే, అంటే దేనిమీద వ్రాస్తే దానెడు బరువుగల బంగారం యివ్వబడుతుంది." ఈ ప్రకటన అందర్నీ ఆశ్చర్యపర్చింది.

మహా పండితులు, కవులు ముందుకు వచ్చి పెద్ద పెద్ద అట్టలమీద, పలకలమీద పద్యాలు వ్రాసుకువచ్చేవారు. రాజుగారు ఒక్కొక్కర్నే వారి వారి పద్యాల్ను చదవమనేవారు.

**వాళ్లు** చదివినతర్వాత, "ఎబ్బే ...! ఇవి పాత పద్యాలే...!" అనేసేవాడు. "మహా రాజా! నేను సొంతంగా యివ్వాళే కల్పించాను ..!" అని యెవరయినా అన్నారా! "కాదు, ఇవి పాతపద్యాలే...! కావలిస్తే నేచెబుతావినండి." అని గడ గడ ఒక్క తప్పులేకుండా ఆ పండితుడు చదివిన పద్యాన్ని తిరిగి ఒప్పగించేవాడు! ఇంకా యెవరయినా అనుమానపడినట్లయితే "రాణి చెబుతుంది, వినండి!" అని రాణీచేత పద్యాన్ని చెప్పించేవాడు!! అంతే కాదు, ఆ వెంటనే యువరాజు చేత కూడా చెప్పించేవాడు!!!

ఇలా వచ్చిన ప్రతిపండితుడు వఠి చేతుల్తో వెళ్లిపోతూవుండేవారు — ఆ

రోజుల్లో 'గిలిగింత' అనేపండితుడొకడు వుండేవాడు. గిలిగింత ఇలా ఎంత క్రొత్త పద్యాన్నయినా రాజుగారు చెప్పడానికి కారణం గ్రహించాడు. అది రాజుగారు ఏ పద్యాన్నయినా ఒక్కసారి వింటే చెప్పేయగలడు! రాణి రెండు సార్లు వింటే చెప్పేయగలదు!! యువరాజు మూడుసార్లు వింటే ఆ పద్యం ఒప్పచెప్పేయగలడు.

గిలిగింత అల్లిబిల్లిగా ఒక పద్యం అల్లి రాజుగారిదగ్గరకి వచ్చాడు "చదవండి, మీ పద్యం" అన్నాడు రాజు.

"మహా రాజా! నేనుపద్యాలు మీకు ఒంటరిగా చెపుతాను. అవి పాతవయినట్లయితే మీరు సభలోకివచ్చి చెప్పేయవచ్చు...!" అన్నాడుగిలిగింత. 'సరే' నన్నాడురాజు.

గిలిగింత ఏకాంతంగా ఒకగదిలో రాజుగార్కి పద్యం చెప్పాడు పెద్దపెద్ద సమాసాలుపడేసి. "! ఒస్సీ ఇదీ పాతపద్యమే!" అంటూ సభలోకివచ్చి కొన్నితప్పులతో పద్యాన్ని చెప్పేశాడు రాజుగారు.

"ప్రభూ! తప్పులు వచ్చాయికదా!" అన్నాడు గిలిగింత.

"అవును! ఇది మరీ, పాత పద్యం. అందుచేత తప్పులువచ్చాయి!" అన్నాడు రాజు.

"కాదు, ఇది కొత్త పద్యమే...! కావలిస్తే రాణీగార్ని చెప్పమనండి" అన్నాడు గిలిగింత.–రాణి ఆ పద్యం ఒక్కసారే విన్నది. అందుచేత చెప్పలేక "అది క్రొత్తదే...!" అంది. యువరాజు మూడు పర్యాయములు వింటేగాని చెప్పలేడుగా...! క్రొత్తదేనని ఒప్పుకున్నాడు.

"అయితే, యీ పద్యం దేనిమీద వ్రాశావు...?" అన్నారు గత్యంతరం లేక రాజుగారు.

"ప్రభూ...!అదో, ఆ కనిపిస్తున్న పెద్ద 'కొండ' మీద వ్రాశాను. దాని బరువు బంగారం..." – రాజుకు తారెత్తింది. దూరం ఆలోచించి"ఓ, అలా గేయిస్తాం...! ఆ కొండనంతట్నీ తీసుకురా.. !"అన్నాడు రాజుగారు.

"ప్రభూ.. ! మీరు త్రాసు పంపితే, దాన్లోపెట్టి పంపుతాను...!" అన్నాడు తడుముకోకుండా గిలిగింత. దాంతో రాజుగారు నోరు వెళ్లబెట్టి సింహాసనంలో కూలబడిపోయారు.

# చెడు స్నేహము

అనగా అనగా ఒక వూరిలో ఒక రైతు, అతని భార్య నివసిస్తుండేవారు. వారికి చాలకాలము సంతానములేక విచారపడుచుండెడివారు. ఒక రోజున భార్య, భర్త దేవాలయమునకుపోయి సంతానము ప్రసాదింపుమని భగవంతుని పలుమారు ప్రార్థించిరి. ఆరోజున రాత్రి భగవంతుడు రైతు భార్య కలలో కనుపించి "నీవు సంతానము కొరకని యింత తాపత్రయపడుతున్నావుకదా! - రేపు నీవు భర్తతో కలసి పొలమునకు వెళ్లునప్పుడు దారిలో ఒక బాతు కనుపించును. మీరు దానిని సమీపించగానే అది ఒక గ్రుడ్డుపెట్టి పారిపోగలదు. ఆ గ్రుడ్డును నీవు తీసికొని వెళ్ళి భక్షించినచో సంతానము కలుగును" అని చెప్పెను.

మరునాడలాగే పొలమునకు పోవునప్పుడు రైతు దంపతులకు బాతు కనుపించి, గ్రుడ్డుపెట్టి పారిపోయెను. దానినిభద్రముగా తీసికొని వెళ్లుచుండుటను భర్తచూచి "ఎందుకు దానినంత భద్రముగా తీసికొని వెళుతున్నావు" అని అడిగాడు.

రాత్రి తనకు వచ్చిన కలను భర్తతో చెప్పింది రైతు భార్య. ఆ గ్రుడ్డు తినిన రెండు మూడు రోజులకే ఆమె గర్భవతి అయిరది. నవమాసములునిండి చక్కని కుమార్తెను కనింది. రేవతి అని పేరుపెట్టి అల్లారు ముద్దుగా పెంచసాగారు.

రేవతిని అయిదవఏట బళ్ళో ప్రవేశ పెట్టారు. అందచందాల్లోనేమి, ఆటపాటల్లోనేమి, విద్య తెలివితేటల్లోనేమి, రేవతి తన తరగతిలో అందరికంటె మిన్నగానుంటూ వచ్చింది. అది చూచి చాలమంది ఈర్ష్యపడసాగారు. కొందరు ఉపాధ్యాయునితో చీటికి, మాటికి లేనిపోని చాడీలు చెప్పేవారు.

ఇలా యుండగా కొంత కాలానికి రేవతికి దుస్సాంగత్యము అలవడింది. క్రమంగా తరగతిలో పుస్తకాలు, కలములు పోసాగినవి. ఒక రోజున రేవతిని పిలచి "ఏమమ్మా! అనసూయ కలం పోయిందట-తీశావా" అని అడిగాడుఉపాధ్యాయుడు. తీయలేదని అబద్ధముచెప్ప యిష్టపడక తీశానని చెప్పి తెచ్చియిచ్చింది. కాని పోను పోను చెడ్డ స్నేహంవలన రేవతి తరగతిలో దొంగతనానికి బాగా అలవాటుపడింది. ఉపాధ్యాయుడు జరిగిన దొంగతనాన్ని గురించి నిజం చెప్పమని గద్దించి అడిగినను నిజంచెప్పేదికాదు. ఉపాధ్యాయుడికి రేవతి పట్ల కోపము, అసహ్యము అధికమయినవి. బళ్ళో నుంచి దొంగతనమున కలవడిన బాలికల నందరితో బాటు రేవతినికూడ వెళ్ళగొట్టాడు.

రేవతి తన తప్పు తను తెలుసుకొని చాల సిగ్గుపడింది. తను దుస్సాంగత్యమువల్లనేకదా యిలా మారిపోయి అవమానమునకు గురియయినానని పశ్చాత్తాపపడింది. ఆ అవమానంతో మరల చదువుకోడానికి ఏస్కూలులో చేరలేకపోయింది.

కుమారి పి. శాంత

(906 పేజీ తరువాయి)

అందరాని స్థలములను మన మనసు అందగలుగుచున్నది. మన మనసుకు చేరరాని దృశ్యములను మన బుద్ధి ప్రవేశింపగలుగుచున్నది కనుక బాహ్యా రెండుకోశములకన్న ఈ మనోమయ విజ్ఞానమయ కోశములు సూక్ష్మములు. అన్నిటికన్న సూక్ష్మమైనది ఆత్మ. "అది అన్నిటిని ఆక్రమించగలదు. దానిని ఏదియు ఆక్రమించజాలదు" అని శ్రుతులు వక్కాణించుచున్నవి. అది సర్వవ్యాపి.

ఇపుడు ఈ వివిధకోశములను పరీక్షించెదము. అన్నమయకోశము-ఈ జాగ్రతావస్థలో సర్వులకుఎరుకయందుండు ఈ స్థూలదేహము అన్నమయకోశము. దీనికిట్లు పేరుగలుగుటకు కారణము, ఇది మన తండ్రులు భుజించిన అన్నరసమునుండి యుత్పన్నమయినది. అన్నము భుజించుటవల్ల ఇది అస్తిత్వము కలిగియున్నది. కడపట, మరణాంతము అన్నములో ఇది లయము కావలసియున్నది. ఈ విషయపూరిత స్వరూపము అన్నమునుండి ఉత్పన్నమై అన్నమునందు రక్షింపబడి అన్నమునందు లయము గాంచుచుండుటవల్ల దీనిని అన్నమయకోశమని చక్కని పేరు గాంచినది. జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు దీనిలో ఏర్పడియున్నవి.

ప్రాణమయకోశము-మనము పీల్చు ప్రాణవాయువు రక్తముతో కలిసి దేహమునందు ప్రతి అణువును చేరుచున్నది. మనము పీల్చు గాలిలోని ప్రాణవాయువు ఈ స్థూల దేహమునకు లోపైపు పూత పూసినట్లు వ్యవహరించుట మనము సులభముగా యూహించగలుగుచున్నాము. ఈ ప్రాణమయకోశము కర్మేంద్రియములను వ్యవహరింపజేయుచున్నది.

(సశేషము)



# వేసవి నృత్య పాఠశాల

మద్రాసు నగరంలో ప్రఖ్యాత నర్తకీ, నర్తకులు శ్రీమతి సామ్రాజ్యం, శ్రీ రమణరావుగారలు ఏర్పాటుచేసిన వేసవి నృత్య పాఠశాలకు నటన కళానిధి గోపీనాధ్ గారు హిందీ ప్రచార సభలో యీ నెల 2-వ తేదీన ప్రారంభోత్సవము జరిపారు. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు అధ్యక్షత వహించారు.

ఈ పాఠశాల నిర్వాహకులయిన శ్రీ రమణారావు దంపతులు నామమాత్రపు రుసుముతో యువతీ యువకులలో నృత్యకళా వ్యాప్తిని, కళాపిపాసను పెంపొందించ నుద్దేశించడం అభినందించతగినది.

శ్రీ గోపీనాధ్ గారు, శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారు చెప్పినట్లు కళాసంస్కృతుల వ్యాప్తికి యిట్టి పాఠశాల లవసరము. ఈ పాఠశాలలో స్థానిక ప్రజలే కాక దూరదేశములనుండివచ్చి కళాశిక్షణ పొందనగును. నృత్యము యువతీ యువకుల శారీరక, అంగసౌష్టవాలను పెంపొందించి వారిలో క్రమశిక్షణను పూరిస్తుంది. సామాజిక నృత్యాలను రూపొందించి మానసిక వికాసాన్ని, ఆనందాన్ని సామాన్య ప్రజానీకంలో పెంపొందించడానికి శ్రీ గోపీనాధ్ బోటి నటన కళానిధులు పూనుకోవాలి.

ఈ పాఠశాల మే నెల 1-వ తేదీన ప్రారంభమయి జూన్ నెలాఖరుదాక నిర్వహించబడుతుంది. ప్రత్యేక శ్రద్ధాశక్తులతో కూడిన సుశిక్షణ; పరాయి యూరివారికి హాస్టలు వసతులున్నవి. నెలవారీ జీతం రు. 25 లు. యితర వివరములకు - శ్రీ యస్. వి. రమణారావు, 17 పెలాతోపు, మద్రాసు-4 కు వ్రాసి తెలిసికోవచ్చును.

# కొవ్వూరు మహిళా సమాజపు

## 19 వ వార్షికోత్సవము

---

మహిళా సమాజమునకు శాఖగా 1944 సం॥లో స్థాపించిన సంస్కృత బాలికా పాఠశాలకు జిల్లా ప్లానింగ్ కమీషన్ వారి 50% ధన సహాయముచే కట్టించిన నూతన భవనమునకు 2-5-55 తే॥ రాత్రి "గృహప్రవేశము" జరుపబడినది. బీదలకు అన్నదానము, అతిథులకు అల్పాహార విందు జరుపబడినది.

3-5-55 తే॥ మంగళవారం సా॥ 5గం॥కు శ్రీయుత న్యాపతి రాఘవరావు (రేడియో అన్నయ్య) గారి అధ్యక్షతను మహాసభ జరుపబడినది. ప॥ గో॥ జిల్లా కమ్యూనిటీ ప్రాజెక్టు కన్వీనరుగారైన శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు సభా ప్రారంభము గావించిరి. బాల అన్నయ్యగారు మహిళా సమాజానికి మరొక శాఖగా "బాల సంఘము"ను స్థాపించి బాల విజ్ఞానాన్ని ప్రబోధించారు.

శ్రీయుత కేశిరాజు అప్పారావుగారు (కొవ్వూరు సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్) మున్నగు పుర ప్రముఖులు ఉపన్యసించినారు. భవనానికి సహాయం చేసిన కొవ్వూరు జైహింద్ ఆర్ట్సుక్లబ్ వారికి, రు 1500 లు భూరి విరాళము నిచ్చిన దొమ్మేరు వాస్తవ్యులు శ్రీయుత పెండ్యాల వెంకట కృష్ణ రంగారావు జమీందారుగారికి, భవనమును కట్టించుటే కాకుండా విరాళము నిచ్చిన శ్రీయుత కోడూరు అప్పారావుగారికి, ఇంకను సహాయముచేసిన పురప్రముఖు లందరకును కృతజ్ఞత తెలుపబడినది. ప్రస్తుతము కట్టించిన రెండు గదులు చాలవు. మూడవ గది చాల అవసరము. దానికికూడా పురవాసులెల్లరు పైవిధమున తోడ్పడ ప్రార్థన అని కూడ తెలుపబడినది.

పాఠశాల బాలికలు వచ్చిన యతిథులకు "స్వాగతము"ను చెప్పి, "భగవద్గీత" నాటకము (కర్మయోగము) ప్రదర్శించిరి. వందనములతో నాటి కార్యక్రమము ముగిసినది.

4-5-55 బుధవారం సాయంకాలము 5 గం॥ శ్రీమతి ఉ॥ భా॥ ప్రవీణ బత్తుల కామాక్షమ్మగారు (ఆంధ్ర యువతీ సంస్కృత కళాశాల ప్రిన్సిపాలు-రాజమండ్రి) మహిళా సమాజ వార్షికోత్సవమునకు సభాధ్యక్షత వహించిరి. శ్రీమతి దేవులపల్లి సత్యవతమ్మగారు (తణుకు) సభా ప్రారంభము గావించిరి. శ్రీమతి ఉ॥ భా॥ ప్రవీణ ఎమ్. వి. తాయారమ్మగారు కార్యదర్శి నివేదికను చదివిరి. తాము 1944 సం॥నుండి నిర్వహించుచున్న సంస్కృత బాలికా పాఠశాల 1953-54 సం॥ ఆదాయ వ్యయములను తెల్పిరి.

మరియు సెంట్రల్ సోషల్ వెల్ఫేరుబోర్డు వారు మహిళా సమాజములో కుటీర పరిశ్రమలకని॥ రూ. 3000 లు. గ్రాంటు మంజూరు చేసినారనియు జూలై 1-వ తే॥ నుండి మిషన్ కుట్టు, ఎంబ్రాయిడరీ, నవారు నేత, రాట్నము వడకుట మొ॥ చేతి పనుల శాఖనుకూడా ప్రారంభము చేయుచున్నామనియు, పైజెప్పిన పనులన్నియు "ఉచితముగా" చెప్పబడునుగాన సోదరీ మణులందరువచ్చి నేర్చుకొని తగు ఫలితమును పొందగోరెదము అని చెప్పిరి.

అనంతరము పాఠశాల బాలికలు "ఆంధ్రమాత టాబ్లో"; "సక్కుబాయి" నాటకము ప్రదర్శించి ప్రేక్షకుల నానందపరచిరి. తరగతులలో ప్రథమ ద్వితీయ శ్రేణిలో వచ్చిన వారికిని, నాటకములందు పాల్గొనిన బాలికలకును చినగంధం కౌసల్యమ్మగారు (పెద్దాపురం) బహుమతుల నిచ్చిరి.

కార్యదర్శిని వందన సమర్పణముతో జనగణమన జాతీయగీతముతో సభ ముగిసినది.

---o---

# శ్రీ కేసరిగారి జన్మదినోత్సవము

గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము.

కేసరి కుటీరం లిమిటెడ్, గృహలక్ష్మి పత్రిక వ్యవస్థాపకులు డాక్టరు కే. యన్. కేసరిగారి జన్మదినోత్సవము ఏప్రిల్ 26వ తేదీన వారి కుమార్తె శ్రీమతి కే. శారదా దేవిగారి అధ్యక్షతన వైభవముగా జరిగింది. ఉత్సవము కుమారి వసంత దైవ ప్రార్థనలో ప్రారంభమయ్యెను.

కేసరి కుటీరం, గృహలక్ష్మి సంస్థలలోని పరివారమునకు అన్నవస్త్రదానములు జరిగెను. అనంతరము జరిగిన సమావేశములో శ్రీమతి పోణకా కనకమ్మగారికి గృహలక్ష్మి స్వర్ణకంకణమును, పరివారమునకు వస్త్రములను శ్రీమతి కే. మాధవి అమ్మగారు బహూకరించిరి.

గృహలక్ష్మి ప్రస్తుత సంపాదకులు స్వాగతము చెప్పుచు శ్రీ కేసరిగారి అభిమాన పాత్రమైన సంస్థలు కలకాలము వర్ధిల్లాలనియు, అందువలన వారి ఆశయ, లక్ష్యాలకు భంగము కలుగవనియు చెప్పి శ్రీమతి పోణకా కనకమ్మగారిని పరిచయముచేయుచు ఆమెకు సంఘసేవపట్ల ఆసక్తి, జాతీయోద్యమంలో ఆమె నిర్వహించిన పాత్ర, చేసిన త్యాగములు అమోఘమయినవని వివరించి, వారి భక్తి, పారమార్థిక చింతలను ప్రోత్సహించిన రచనలు మహోపయుక్తములనిరి. కస్తూరిదేవి విద్యాలయ స్థాపనలోను, నిర్వహించుటలోను శ్రీమతి కనకమ్మగారి దీక్షాసక్తులు ప్రశంసనీయమనిరి.

శ్రీమతి కనకమ్మగారు. అనారోగ్యముగా నున్నందున శ్రీమతి ఆం. సుశీలా దేవిగారు ఆమె ఉపన్యాసమును చదివారు. అందులో గృహలక్ష్మి పత్రికను ప్రశంసిస్తూ గృహలక్ష్మిలాంటి ఉత్తమ పత్రికల ఆవశ్యకతను వివరించి దేశ సౌభాగ్యంకొరకు ప్రతిఒక్కరు కంకణం కట్టుకొని కృషి సల్పాలనిరి. (పూర్తి ఉపన్యాసమును మరొక చోట ప్రచురించినాము)

శ్రీ సి. సి. పున్నయ్యగారు వందన సమర్పణ సందర్భమున అన్న, వస్త్ర కంకణ ప్రదానములు చేసిన శ్రీమతి మాధవి అమ్మగారికి, ఉత్సవము జయప్రదముగా జరుగుటకు తోడ్పడిన కేసరి కుటీరం లిమిటెడ్ పరిపాలక వర్గానికి, సహచరులకు కృతజ్ఞతను తెలుపుతూ సాంఘిక అభ్యుదయ అభివృద్ధి కార్యక్రమాలకు ప్రభుత్వము మాత్రము ధనము వెచ్చించిన చాలదనియు, ప్రజలు స్వీయ సమస్యల నర్థము చేసికొని వాని పరిష్కారానికి ప్రభుత్వముతోపాటు సహకరించి త్యాగయుక్తమయిన కృషి చేయాలనిరి.

అంతటితో ఉత్సవకార్యక్రమము ముగింపుకువచ్చెను.

---




దేవదాస్ : విద్వాన్ కె. వి. జీ. రామారావు బి. ఏ., సూపరింటెండెంట్, రెవిన్యూ సెక్రటేరియట్, కర్నూలు. వెల రూ. 1-4-0.

ఈ కథా వస్తువు వెండితెరపై కెక్కినదే. కాని కవి కరుణారస భరితములగు నాలుగువందల పద్యములలో యిందలి భగ్న ప్రేమికులగాథ రసవత్తరముగ చిత్రించినారు. జీవితములో నిశ్చితాభిప్రాయము లేక చేతులార దానికి విషాదపరిణామము సమకూర్చుకొన్నాడను అభిప్రాయము దేవదాసు పైకం దానిని యీ కావ్యము ఆదినుంచి అంతమువరకు చదివిన మారిపోవును. కవి దృష్టిలో దేవదాసొక త్రాగుబోతు కాడు. అతడు ఒక లౌకిక ప్రళయమూర్తి. అతని ప్రేమ అధ్యాత్మికమైనది. దేవదాసు త్రాగినది, క్రక్కినది మద్యము గాదు. జీర్ణముగాని కోరికలే. దేవదాసు తన్మయత్వమున పలికిన వేదాంతసుధులు కొన్ని ఒమార్ ఖయామ్ సిద్ధాంతముల ననుసరించి యున్నది. "ఉండదు యవ్వనంబు యిక నుండదు జారిన మద్యకోటికిన్"; "దానికిని దీనికిని లంకెతాళ్ళి మిగులు దైవమాయగ సరిజూపి దాటకుండ, చెప్పగలవోయి శాస్త్రాలువిప్పి నాకు అర్థమానట్లు నమ్మకంబగునట్లు". శైలి కఠినముగాక సాఫీగా నడుచుచున్నది. పద్యముల నడక ఎచ్చటను కుంటువడ లేదు. వినువారికి ఏదో సంగీతము విన్నట్లగును; పుస్తకము, భావసూచకములగు చిత్రములతో ఆకర్షణీయముగ ముద్రింపబడినది.

కె. వి.

బాలమాంత్రికుడు : శ్రీ బి. వి. రాధారమణగుప్త, రాధారమణ్ కార్యాలయం, పాలకొల్లు, వెల 0-8-0.

ఇది బాలలకని ఉద్దేశించి రచించిన పుస్తకము. ఇందులోని కథతోపాటు బొమ్మలు, ముత్యాలలాంటి అచ్చుకూర్పు చాల ముచ్చటగా నున్నది.

కథ చదువను చదువను ఉత్సాహ జనితంగానుండి ఆనందపరవశులను చేస్తున్నది. పుస్తకం చాల ఆకర్షణీయంగా నున్నది.

బాల బాలికలలో విద్యా విజ్ఞానముల వ్యాప్తికి, వినోద ఉల్లాసాలకు యిలాంటి పుస్తకాలు చాల అవసరం. ఈ గ్రంథ ప్రచురణ కర్తలు పిన్నవారైనా సాధక బాధకాలకోర్చి యీ పుస్తకాన్ని వెలువరించినందుకు అభినందనీయులు.

గాంధీస్మృతి : శ్రీమతి కోగంటి అన్నపూర్ణమ్మ, శ్రీ విఘ్నేశ్వర గ్రంథమాల, పామర్రు, కృష్ణాజిల్లా, వెల 0-5-0.

ఇందులో వేరు వేరు రచయితల పాటలు, పద్యాలు గాంధీజీని స్మరించునవి యున్నవి. ఇవి భావరస పూరితములై సామాన్య ప్రజలు సయితము నిత్యజీవితంలో కంఠస్థముచేసి గానముచేయుట కనువైన సాహిత్యముతో నొప్పారుచున్నవి.

**గాంధీజీ జీవిత చరిత్ర ఆబాల గోపాలమునకు చిరస్మరణీయమయియుండగా, అందుకు యీ చిన్న పుస్తకము ఉపకరించడం హర్షణీయము.**

# సంపాదకీయములు

## హిందూ వివాహాలబిల్లు – ఆస్థి వారసత్వము

హిందూ వివాహాలబిల్లు ఆమోదించబడటంతో సనాతనులలోను, పూర్వాచార పరాయణులలోను కొంత అసంతృప్తి, ఆవేశాలు రేగినా ఈ బిల్లు న్యాయమైన కుటుంబ వ్యవస్థను రూపొందించడానికి ఉద్దేశించబడిన విషయం మరువకూడదు.

విడాకుల కవకాశము ఏర్పడిన ఫలితంగా స్త్రీపురుషులలో స్వేచ్ఛాతత్వము పెరిగి, అవినీతి పెరుగుదలకు దారి తీయగలదని కొందరు వాదించారు. దాని కవకాశము ఎట్లున్నా, ప్రజానీకం శాసనం తమ అభివృద్ధి అభ్యుదయాలకని ఉద్దేశించినదనియు, దానిని తమ స్వప్రయోజనాలకు బాధ్యతతో జాతీయ విశిష్టతకు, సాంప్రదాయానికి, గౌరవ ప్రతిష్టలకు భంగము కలుగకుండా వినియోగించుకోవాలనేది ప్రధాన విషయం. ప్రభుత్వము ఏ శాసనమును రూపొందించినా అది అమలు జరుగడానికి, దానివలన ప్రజలకు సత్ఫలితాలు కలుగడానికి, వాని ఉద్దేశాలను, వివరాలను సద్భావంతో గుర్తించి ప్రభుత్వంతో ప్రజలు సహకరించాలి. అది లోపించిననాడు ప్రజాశ్రేయస్సు నుద్దేశించి ఎట్టి శాసనముచేసినా సద్వినియోగం జరుగక పోవచ్చును.

స్త్రీ పురుష లిద్దరిలో ఎవరికి అన్యాయము జరిగినా, వారికి రక్షణ కల్పించడానికనే యీ విడాకుల కవకాశము ఏర్పడింది. స్త్రీ పురుషులు స్వీయ హక్కులను, అవకాశములను సమాన ప్రాతిపదికమీద పరస్పర సహకార సద్భావములతో గుర్తించి వ్యవహరించినంతకాలం విడాకులు సత్ఫలితాలనే యివ్వగలదు.

ఇక ఆస్థిపాస్తుల విభజనలో కుమారునితోబాటు కుమార్తెకు సమాన భాగముండాలా లేదా యనేది వివాదాంశమయింది. కాని కుమారులకు, కుమార్తెలకు సమాన విద్యావసతుల కల్పించి, వివాహాది కార్యాలు చేసి తండ్రి మిగిలియున్న ఆస్థిని కుమారులకు, కుమార్తెలకు సమానంగా పంచియివ్వడంలో అభ్యంతరము ఏమిటి? సమిష్టిగా నున్నంతకాలము కుమారులెట్లు కుటుంబ బాధ్యతలను వహిస్తారో కుమార్తెలుకూడ సమానంగా వహించుచున్నప్పుడు విభాగాలయేటప్పుడు ఆస్థిపాస్తులలో కూడ కుమారులతోబాటు కుమార్తెలుకూడ సమాన భాగస్తులగుతారు.

అయితే కుమార్తెలకు ఆస్థిపంపకమువలన వారిలో స్వేచ్ఛా బీజాలు మొలకలెత్తి తప్పుడు దారులు త్రొక్కుతారనేది ఒక వాదం. కాని బాధ్యతా రహితంగా వ్యవహరించనంతకాలము ఆ సమస్య రానే రాదు. పైగా వరకట్నాల నరికట్టడానికి యిది చక్కని ప్రాతిపదిక కాగలదు. కుమారులతోబాటు కుమార్తెలు సమానంగా ఆస్థిపంచుకోడంవలన ఆస్థిపాస్తులు సయితం వికేంద్రీకరించబడి అనేక కుటుంబాలు అభివృద్ధికి రాగలవు. కాబట్టి కుమార్తెలకు, కుమారులకు ఆస్థితోబాటు హక్కులు, బాధ్యతలు వెన్నంటి యుంటవనేది గమనించవలసిన విషయము.

## పాకిస్తాన్ మహిళల తిరుగుబాటు

పాకిస్తాన్ ప్రధాన మంత్రి మహమ్మదాలీ ద్వితీయ వివాహం చేసికోడంతో పాకిస్తాన్‌లో బహుభార్యాతత్వంపట్ల వ్యతిరేకతను పాకిస్తాన్ మహిళా సంఘం మరింత తీవ్రంగా ప్రకటిస్తున్నది.

తమ పదవులను, ఉద్యోగాల నాధారంగా చేసికొని మొదటి భార్య యుండగానే పునర్వివాహం చేసికోడానికి పూనుకొనువారిని హెచ్చరిస్తూ వారిని, వారి భార్యలను వెలివేస్తామని మహిళా సంఘం ప్రకటించింది. దాంతోబాటు రాళ్లు, రప్పల దెబ్బలకుగూడ గురికావలసి వస్తుందని ప్రకటించిందట.

నిజంగా పాకిస్తాన్ మహిళా సంఘపు ధైర్య సాహసాలు అభినందించతగినవి. బహు భార్యాతత్వాన్ని అరికట్టడానికి జరిగే ప్రయత్నాలలో వీరికి భాగస్తుల సానుభూతి విశేషంగా నుండగలదు.

## కడుపునిండా తిండి – ఒంటినిండా గుడ్డ

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక వ్యవసాయ లక్ష్యము కడుపునిండా తిండి, ఒంటినిండా గుడ్డ వివిధ రాష్ట్ర ప్రతినిధుల చర్చల సందర్భమున ప్రకటింపబడింది.

కడుపునిండా తిండి, కట్టుకోడానికి గుడ్డ ఏర్పడిననాడు సామాన్య ప్రజానీకానికి యితర దైనికావసరాలు వాటంతట అవే అమరుతవి.

వ్యవసాయ రంగంలో సాధించబోయే ఘనవిజయాల ఫలితంగా పుష్కలంగా ఆహారము, గుడ్డ సమకూరుతుందనునది నిజమే కావచ్చు. కాని వానిని వినియోగించుకోడానికి కావలసిన కొనుగోలు శక్తి ప్రజలకు అమరాలి. ఉత్పత్తిదారులు, వినియోగదారులు కష్టనష్టాలకు గురికాకుండా తమ నిత్యావసరాలు పోను మిగిలియుండు ధాన్యములు, గుడ్డ అమ్మకానికి ధరలు సరసమయినవిగా నుండాలి. ఇవన్నీ ప్రజావసరాలే. వీని నన్నిటిని ప్రభుత్వము శ్రద్ధతో పరిశీలిస్తుందనే ఆశిద్దాం.

# శ్రీ మన్మథనామ సం॥ర వైశాఖ, జ్యేష్ఠ మాసములు

| | | | |
|---|---|---|---|
| | 16 | సో | న 18.55 శత 21.40 |
| | 17 | మం | ద 17.14 పూభా 21.43 త్యా 3.46 హనుమజ్జయంతి |
| | 18 | బు | ఏ 14.21 ఉభా 20.35 |
| | 19 | గు | ద్వా 10.20 రేవ 18.25 త్యాజ్యాభావః |
| | 20 | శు | త్రి 5.31 చతు 54.27 అశ్వ 15.18 మాసశివరాత్రి, అమృతయోగః |
| 1955 సం॥ మే నెల | 21 | శ | ● అమా 53.38 భర 11.30 త్యా 3.43 |
| | | | **జ్యేష్ఠ మాసము** |
| | 22 | ఆ | శుక్ల పా 46.58 కృ 7.5 |
| | 23 | సో | వి 40.11 రో 2.31 త్యా 3.41 |
| | 24 | మం | త 34.3 ఆర్ద్ర 53.39 రంభాగౌరీవ్రతం |
| | 25 | బు | చ 28.16 పున 50.4 ఉమావ్రతం |
| | 26 | గు | పం 23.14 పుష్య 47.20 తిథిద్వయం, అమృతసిద్ధియోగం |
| | 27 | శు | ష 19-8 ఆశ్లే 45.37 సిద్ధియోగః |
| | 28 | శ | స 16.7 మ 44-41 |
| | 29 | ఆ | అ 14.19 పూఫ 45-40 అమృతయోగః |
| | 30 | సో | న 13.44 ఉఫ 47.31 త్యా 4.8 |
| | 31 | మం | ద 14.24 హ 50.32 |
| | 1 | బు | ఏ 16.10 చి 54.34 |
| | 2 | గు | ద్వా 18-58 స్వా 59.29 త్రయోదశితిథిః |
| | 3 | శు | త్ర 22.33 విశా 60.10 శూన్యతిథిః |
| | 4 | శ | చతు 26.41 విశా 5.10 త్యా 4.24 చతుర్దశితిథిః, సిద్ధియోగః (కంచి వరదరాజ స్వామి గరుడోత్సవం) |
| | 5 | ఆ | ○ పౌ 31.9 అనూ 11.5 |
| | 6 | సో | కృ పా 35.35 జ్యే 17-26 త్యా 4.24 |
| | 7 | మం | వి 39-50 మూ 22.57 |
| 1955 సం॥ జూన్ నెల | 8 | బు | త 43.35 పూషా 28.22 |
| | 9 | గు | చ 46.31 ఉషా 33.7 |
| | 10 | శు | పం 48.34 శ్ర 36 48 త్యా 4-12 |
| | 11 | శ | ష 49.24 ధ 39.46 |
| | 12 | ఆ | స 49.34 శత 41.5 భానుసప్తమి |
| | 13 | సో | అ 47-23 పూభా 41 42 |
| | 14 | మం | న 44.33 ఉభా 40-21 త్యా 3.57 |
| | 15 | బు | ద 40.32 రేవ 38.51 |

•Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



చిరంజీవి పిల్లా వెంకట గోవింద పాత్రుడికి, సౌభాగ్యవతి వరలక్ష్మికి యీ నెల 4వ తేదీన వైభవంగా వివాహం జరిగింది. వరుడు, పిల్లా పాపయ్య పాత్రుడు అండ్ బ్రదర్స్ ప్రొప్రైటరు శ్రీ పిల్లా నరసింహం పాత్రుడుగారి కుమారుడు. వధువు శ్రీ మాకిన నరసింహం పాత్రుడుగారి కుమార్తె.

---

భారత ప్రశస్తి

THE PRIDE of INDIA




LODHRA

FOR LADIES' HEALTH

KESARI KUTEERAM LTD., MADRAS

EASTERNS. 394

లోధ్ర

స్త్రీల ఆరోగ్య భాగ్యానికి

Lodhra Press, Madras-14.